# స్వామి లేఖలు - శాంతి లేఖలు

2 వ భాగము




కర్త :

డా॥ మోపిదేవి కృష్ణస్వామి

ఎమ్.ఎ., పిహెచ్.డి.





ది యూనివర్సల్ హ్యూమానిటేరియన్

ఎడ్యుకేషన్ ట్రస్టు ప్రచురణ

ప్రథమ ముద్రణ :

**93 జనవరి గురుపూజలు**

ప్రతులు : 1,000



**వెల : రు. 20/-**

ప్రతులకు :

**ది యూనివర్సల్ హ్యూమానిటేరియన్ ఎడ్యుకేషన్ ట్రస్టు**

23-10-7,
పురుషోత్తం వీధి,
సత్యనారాయణపురం,
విజయవాడ-520 011.

1-99,
ముంజులూరు-521 366,
బంటుమిల్లి మండలం,
కృష్ణాజిల్లా.

ముఖచిత్ర కల్పన : కాశీ, బాలి

ముఖచిత్ర ముద్రణ : కె. నాగభూషణం

ముద్రణ :

శ్రీ అరుణోదయ ప్రింటింగ్ ప్రెస్
సీతారామపురం, విజయవాడ-520 002.

# ఇందులో....

పేజీ నెం.

పేజీ నెం.

# ఇన్నినాళ్లకు

మళ్లీ ఇన్నినాళ్లకు స్వామిలేఖలు - కాంతిరేఖలు గ్రంథంగా రూపు చెంది మీ చేతికి అందుతున్నాయి. ఇందుకు మాకు చాలా సంతోషంగా ఉంది.

సంస్థ నుండి ఎన్ని గ్రంథాలు వెలువడుతున్నా, ఎన్ని రకాల ప్రక్రియలు వెల్లివిరుస్తున్నా ఏ గ్రంథం వైభవం ఆ గ్రంథానిదే! ఏ ప్రక్రియ వైశిష్ట్యం ఆ ప్రక్రియదే!

ప్రారంభమైన ప్రక్రియలన్నీ వరుసగా భాగాలను సంతరించు కుంటూ వస్తున్నాయి. చాల కాలంనుండి అలా నిలబడి ఇప్పుడే రెండవ భాగాన్ని సంతరించుకొంటున్న ప్రక్రియ స్వామిలేఖలు - కాంతి రేఖలు. ఈ భాగం కోసం ఎదురుచూస్తున్న వారెందరో! ఎందరెందరో!!

మామూలుగా చూస్తే ఇవి అనేక మందికి అనేక సమయాల్లో వ్రాయబడిన లేఖలు చూడవలసిన విధంగా చూస్తే మానవుడికి అతని యొక్క వివిధ స్థితులను ఉద్దేశించి, విభిన్న సమయాలలో ప్రసరిస్తూ వచ్చిన కాంతిరేఖలుగా మనకు బోధపడతాయి.

ఈ లేఖలన్నీ మనకు కావలసినవే! ఎప్పుడో అప్పుడు మనకు అవసరపడేవే! అక్కరకు వచ్చేవే!

ఒకామె ఇలా చెప్పింది: నేను స్వామిలేఖలు-కాంతిరేఖలు గ్రంథాన్ని ఎప్పుడు తెరిచినా అప్పుడు నాకు కావలసిన లేఖ ఏదో నా కంటబడుతూ

ఉంటుంది. స్వామి నా అవసరాన్ని గమనించి ముందుగానే అక్కడ వ్రాసి ఉంచారు అనిపిస్తుంది.

ఈ రకంగా ఆయన అందరికీ అన్ని లేఖలా వ్రాసినట్లవుతుంది. ఎవరికి ఎప్పటికి ఏది కావాలో వారికి అప్పటికి అది అందిచినట్లవుతున్నది. మానవజాతి ఎప్పటికీ ఈ అనుభూతిని ఇలా అందుకుంటూనే ఉంటుంది.

అన్ని కాలాలవారినీ, అన్ని దేశాలవారినీ స్వామి లేఖలు ఇలా కాంతిరేఖలై వెలుగు దారివెంట నడిపిస్తూనే ఉంటాయి. వెన్నంటి సాగుతూ చేరవలసిన తీరాలకు చేరుస్తూనే ఉంటాయి.

విజయవాడ,
30-12-92.

మంత్రి
ప్రచురణ విభాగం

# వర్డ్ ప్లే - వరల్డ్ ప్లే

ఒకరు వ్రాసిన లేఖ నీ గుండెలలో దాగి ఉంటే అది నీ వ్యక్తిత్వం గొప్పతనం. నీవు వ్రాసేది పదిమంది హృదయాల్లోకి పోగలిగితే అది ఇంకా 'గొప్పతనం'- అని వ్రాస్తాడు లార్డ్ ఛస్టర్‌ఫీల్డ్ తన కుమారునికి అంటే- లోకం బాధ అంతా తన బాధ అనుకునే మనిషి తన గురించి ఏమీ వ్రాసుకోడు. అందుకే ఆ దొరగారు తన పుత్రునికి వ్రాసిన లేఖలో "ఉత్తరాల్లో నీ సొంత గోలవద్దు పరామర్శించు" అని సెలవిచ్చాడు.

నిజం చెప్పాలంటే ఆ సాధారణీకరణ గొప్ప సైకో ఎనాల్సిస్ నుంచి జనించిందనక తప్పదు. ఎందుకంటే నేటి ప్రపంచంలో దాదాపు అందరూ రుజాగ్రస్తులే! థామస్ హార్డి నవలలపై- ముఖ్యంగా 'మేయర్ ఆఫ్ కాస్టర్ బ్రిడ్జి' నవల పైనగల విమర్శ (సమీక్ష)లలో 'పింక్' సిద్ధాంతం గొప్పది. త్రికాలా బాధ్యమైన సత్యం- మనిషి రాగద్వేషాల సంపుటం. వాటి నుంచి ఆవిర్భవించేది దుఃఖం అనేది కఠోర వాస్తవం. కాని, జీవితం ఆనందమయం కావాలి. అది ఎక్కడో ఉన్నది కనుకనే దాని గురించి ఆరాటపడతాం. అది మనలోనే ఉన్నదన్నది సత్యం. అది ఎలా ఉన్నది! దుఃఖరహితంగా ఉంది. అంటే దుఃఖ కారణమైన రాగ ద్వేషాలను వదిలించుకొంటే ఆనందం ఏమిటో అనుభవంలోకి వస్తుంది. ఈ సత్యావిష్కారం కాస్టర్ బ్రిడ్జ్ నవలలో ఆవిష్కృతమైంది"— అంటూ సాగిన ఆ సిద్ధాంతం భారతీయ తాత్త్విక దృక్పథనికి చేరువలో ఉంది.

విశ్వనాథవారు "....శరన్నిశా సముద్యత్ చంద్రరేఖా సుశీతల నేత్రాంచల కాంతి నా దెసను సంధానింపవే!" అని భార్గవిని స్తుతించారు. చిత్రమేమంటే నిజం తెలిసినవారంతా వారి వారి మార్గాలలో చెప్పేది ఒక్కటే! చంద్రరేఖా.... అని ఒకరంటే స్వీట్ లెటర్స్ (మధురమైన

వ్రాతలు) అని మహాకరంటే లేఖా రచనను మాస్టర్ చేసిన మాస్టర్ ఎమ్ కె. కాంతిరేఖలు అంటున్నారు- స్వామిలేఖలు - కాంతిరేఖలుగా తమ లేఖలను.

మాస్టర్ ఎమ్.కె. డాక్టర్. డాక్టర్ కృష్ణస్వామిగారు వైద్యులు. జగద్విదితమైన మహాభారతంపై పరిశోధనచేసి డాక్టరేట్ పొందిన పండితులు. పండితుడంటే సమదర్శనుడైన యోగి. పండితుడంటే వైద్యుడని కూడా! మాస్టర్ ఎమ్.కె. వైద్యుడంటే భవరోగ నివారణ తంత్రం మంత్రం చెప్పగల భిషగ్వరుడనే!

ఒకటి అంగీకరిస్తాను. వీరి లేఖలు వారి సమక్షంలోనే చదివాను. ఆయన శ్రోత కాగా కొన్ని లైన్లు రెండుసార్లు, మూడుసార్లు కూడా చదివాను. చదివినప్పుడు ఉక్కిరి బిక్కిరి అయ్యాను. కాంతి రేఖలలో కొన్ని మిరుమిట్లు గొల్పాయి. ఎలాగంటే బైరన్ తన భార్యకు లేఖలు వ్రాసేవాడు. భార్యకు వ్రాసే లేఖలు పదిమంది చదవగలిగే గౌరవస్థాయి పొందడం కష్టం. అందులో బైరన్ జీవితం ఎలాంటిది? అటువంటి బైరన్ వ్రాసిన ఉత్తరాలను భార్య చదివి సమాధానం ఏమి వ్రాసిందో తెలియదు గాని. "చదివిందంతా మరిచిపోయానని వ్రాశావు. అలా కావడానికి కారణం నేనైతే మంచిదే" అంటాడు బైరన్.

కృష్ణస్వామిగారి లేఖలు చదివి అందులో విశేషాలు చెప్పాలంటే మాటలు కాదు. ఆ లేఖలు చదివి ముందుమాట వ్రాయాలంటే మాటలా! పి.జి. వుడ్‌హౌస్ ఇంగ్లీషు వచన రచనలో ముఖ్యంగా 'వర్డ్‌ప్లే'లో సిద్ధహస్తుడు. తెలుగులో ఆయనకు సమతూకం ముళ్లపూడి వెంకట రమణగారు, మల్లాది రామకృష్ణ శాస్త్రిగారు. అయితే వీరిరువురిలో ముఖ్యంగా రమణగారి రచన కృతకంగా వుంటుంది. కాని హాస్యం చిలిపి పిల్లాడిలా గంతులేస్తుంది. శాస్త్రిగారి 'వర్డ్‌ప్లే' బాలమురళిగారి స్వర రచనలా హాయిగా వున్నా- అదీ కృతకమే. పాండిత్య ప్రకర్ష.

డాక్టర్ కృష్ణస్వామిగారి వచన రచనలో నిండుగా వర్డ్‌ప్లే ఉంటుంది. మాటలు విరుగుతాయి, సాగుతాయి, మాట తరువాత షిలవ

కుండా మళ్లీ ఎగిరి వస్తుంది అదే మాట. దీర్ఘం లుప్తం కావడంతో అర్థం మారుతుంది. ఈ మాటల చిలిపితనం ఎంత 'రంజు'గా వుంటుందో అంత ప్రమాదం కూడా. బుద్ధిపెట్టి చదవకపోతే అపార్థాలు వస్తాయి. హృదయం పెట్టి చదవకపోతే సంకుచిత మనిపిస్తుంది:

అందుకే కావచ్చును. 'అరసికాయ కవిత్వంచ నివేదనం శిరసి మాలిఖ మాలిఖ మాలిఖ'— అన్నాడు ఆ మహాకవి. అవేవో ఉసిరికాయ లనుకునేవాడికి ఏమర్థమవుతుంది? చదవడానికి బుద్ధి మాత్రమే కాదు, హృదయం కూడా కావాలి. డాక్టర్ కృష్ణస్వామిగారి లేఖలు కాంతిరేఖలు. బుద్ధిని క్షాళన పరుస్తాయి. హృదయాన్ని కల్మష రహితం చేస్తాయి. ఇంట లెక్చువల్ లెవెల్‌లో.... స్పిరిట్యువల్ లెవెల్‌లో.... ఈ రెండు స్థాయిలలో ఏదీ అక్కరలేదనుకునే వారపత్రికల పాఠకులకు, సినీలోలురకు, రాజకీయ సామాజిక స్పృహా వ్యాధిగ్రస్తులకు స్వామిలేఖలు అక్కరలేదు. వారికి కాంతిరేఖలు రావు.

వారి సంగతి ఆలోచించమనే కోరుతున్నాను డాక్టర్ మోపిదేవి కృష్ణస్వామిగారిని. కారణ మేమంటే— బుద్ధిమంతులకు చెప్పవలసిన పని లేదు. బుద్ధిహీనులకు చెప్పేదేమీ లేదు. చెప్పింది పురాణంలాగా వినిపోయే వాళ్ళకు ఎంత చెప్పినా ఒక్కటే— కాని నేడు సమాజ జీవితాన్ని నడుపు తున్నది దగాకోర్లు దగుల్బాజీలు. అయినా భర్తృహరులు ఊరుకోరు అది వేరే విషయం. డాక్టరు గారికి ఒక్కటే విన్నపం. మైక్రో. స్కోపిక్ లెవెల్‌లో పనిచేసే ఓషధీ శాస్త్ర రహస్యాలు తెలిసిన మీరు సినిమా ప్రొడ్యూసర్లకు, రాజకీయ నాయకులకు, సామాజిక స్పృహవాదు లకు ఏ పొటెన్సీలో మందు వేస్తారు? వాళ్ళకు సాధ్యం కాదు కనుక ప్రజలలో ఇమ్యూనిటీ పెంచుతారా!

విజయవాడ,
20-12-92,

ఎల్. వి. రమణ

# ఓర్పు కావాలి - ఒడుపు తెలియాలి

ఇవి కాలక్షేపానికి వ్రాసిన లేఖలు కావు. కాని దారిని పట్టిన వారికి ఇవి వర్తించవు. కర్తవ్యోన్ముఖులై కాలాన్ని సద్వినియోగం చేయదలచిన వారికి ఈ లేఖలు.

సరిదారిని చేరేటందుకు ఆర్తితో ఎదురుతెన్నులు చూస్తున్న వారికి ఈ లేఖలు.

అయితే కాలక్షేప పరులూ, కానిదారిలో ఉన్నవారు ఏమవుతారు ? వారినలా వదిలేయడమేనా! అన్నది ప్రశ్న. విద్యాలయంలో ఒకటవ క్లాసు ఉంటుంది. ఒకటవ క్లాసులో ఎప్పుడూ పిల్లలుంటారు. సంవత్సరాలు ఎన్ని నడుస్తున్నా ఒకటవక్లాసు అలా కొనసాగుతూనే ఉంటుంది. అయితే ఇక్కడ ఒక సూక్ష్మముంది. క్లాసు అలాగే ఉంది గాని, పిల్లలు మారుతున్నారు. అలాగే కాలక్షేపపరులూ, కానిదారిని పట్టినవారూ ఎప్పుడూ ఉంటారు. కాని ఒకప్పుడు అలా ఉన్నవారే ఇప్పుడూ అలా ఉన్నారనీ, ఎప్పుడూ అలా ఉంటారనీ అనుకోకూడదు, అది సరికాదు.

విద్యాలయంలో ఒకటవ తరగతి అలా ఉంటూ ఉండగానే బృందం తరువాత బృందం ఆ తరగతి మీదుగా ఎలా ముందుకు వెళుతున్నారో సమాజంలో ఆయా వర్గాలు అలా వ్యక్తమవుతూ ఉండగానే వ్యక్తుల బృందాలు మాత్రం క్రమంగా ఆయా కక్ష్యలను దాటి పైపైకి పయనిస్తుంటాయి. ఆ దాటి పయనిస్తున్న సమయంలో వారికి ఈ స్వామి లేఖలు

కాంతి రేఖలుగా భాసిస్తాయి. శాంతిరేఖలుగా అనుభవానికి వస్తాయి. అందులో ఏమాత్రం అనుమానం లేదు.

మనిషన్నవాడు మార్పు కోరకుండానూ ఉండడు. మారకుండానూ ఉండడు. అలాగే తానంటే ఏమిటో, తనవెనుక ఏమిటో తెలుసుకోవాలని అనుకోకుండానూ ఉండడు. అనుకున్న తరువాత ఇక తెలుసుకోకుండానూ ఉండడు. తెలుసుకున్న తరువాత దానికి తగినట్లుగా వర్తించకుండానూ ఉండడు. ప్రకృతి పరిణామ శీలమైందికదా! మనమందరమూ కూడా ఆ పరిణామంతో శ్రుతి కలుపవలసిన వారమే కదా!

ఒకటి మాత్రం సత్యం. మనకు తెలిసినా తెలియకపోయినా మన ప్రయాణం మాత్రం ప్రకృతికి అనుగుణంగానే సాగుతుంది. ఆ సాగు తున్న ప్రయాణానికి ఊతమిచ్చేందుకే ఈ స్వామి లేఖలు-శాంతి రేఖలు.

సమాజ స్థితిని దగ్గరగా చూస్తూ మిత్రులు రమణగారు చెందుతున్న ఆవేదన వారి ముందు మాటలో చివరగా కనబడుతున్నది. లోతుగా చూడని వారికి ఆవేదనా భరితమయిన వారి వాక్యాలు నిందా వాక్యాలుగా కూడ గోచరించవచ్చు.

క్రమంగా ఆవేదన ఆర్తిగా రూపొందుతుంది. ఆర్తి తనకు కావల సిన శక్తిని సంతరించుకొంటుంది. శక్తిమంతమై సమాజ పరిస్థితులను సర్దు కొనేట్లుగా చేయగలిగిన వాతావరణాన్ని రూపొందించుకొంటుంది. అటు వైపుగా పయనిస్తున్న మిత్రులు రమణగారిని అభినందిస్తున్నాను. పయ నించే వారికి పైనుంచి సహకారం ఎప్పుడూ అందుతుందని ప్రేమతో తెలియ జెబుతున్నాను.

ఇప్పుడు సమాజంలో మంచిఆశయాలు కలవారు లేకపోలేదు. అయితే ఆ ఆశయాలు కలవారిలో వాటి సాధనకు కావలసిన వాతావరణాన్ని రూపొందించుకొంటున్న వారు అరుదవుతున్నారు.

ఆశయం విత్తనం లాంటిది. ఆ విత్తనం మొలకెత్తడానికి తగిన వాతావరణం కావాలి. ప్రదేశాన్ని పాదుగా రూపొందించకుండా విత్తనం మొలకెత్తదు కదా!

ఆశయం కలిగిన వారికి ఓర్పు కావాలి. ఒడుపు తెలియాలి. పట్టు విడుపులుండాలి. ఆ ఆశయాన్ని ఒక మహాకార్యక్రమంగా పాదుకొలుపగలిగిన దీక్ష ఉండాలి. మానవజాతిని తమస్సునుండి ఈవలకు ఆహ్వానించగలిగిన తపస్సు జరగాలి.

ఇప్పుడు మనమా తపస్సులోనే ఉన్నాం. ఆ తపస్సు నుండి వెలువడుతున్నవే ఈ లేఖలూ, ఈ రచనలు!

సూర్యుని నుండి వెలువడుతున్న కిరణాలు ఎలాంటివో, నా నుండి వెలువడుతున్న ఈ రచనలు అలాంటివి. కావలసిన విధంగా జాతిని జాగృతం చేయడానికి వ్యక్తమవుతున్న ఈ దివ్య కిరణాలకు అందరితో పాటుగా నేనూ అంజలి ఘటిస్తున్నాను. నేనూ అర్ఘ్యాన్ని అర్పిస్తున్నాను.

విజయవాడ

30-12-92

మోపిదేవి కృష్ణస్వామి

# స్వామి లేఖలు — శాంతి రేఖలు

## ఈ వయస్సులో

విశాఖపట్నం

చి॥...............కు ఆశీస్సులు 1-6-78

శలవుల్లో ఊరికే ఉండకుండా, ఏ లైబ్రరీలోనన్నా మెంబరుగా చేరి గాంధీజీ జీవిత చరిత్ర, సాక్షి వ్యాసాలు, మంచి నవలలు తీసికొని చదువు. కాలం వృథా చేసుకోవద్దు. పెద్దవాళ్ళ పుస్తకాలు చదివితే మనను గూర్చి మనకు బాగా తెలుస్తుంది. మనమేం చేయాలో మనకు బోధపడుతుంది. కనుక అట్లాంటి పుస్తకాలు అవకాశమున్నప్పుడల్లా చదవడం ఎంతైనా అవసరం. రవీంద్రనాధ్ ఠాకూర్ వ్రాసిన గీతాంజలి, సాధన మొదలయిన గ్రంథాలకు తెలుగులో అనువాదాలు కూడా ఉంటాయి. వాటిని తీసికొని చదువు. వంటపని, ఇంటిపని, తోటపని చక్కగా నేర్చుకో! ఏది ఏమైనా 15 సంవత్సరాలనుండి 25 సం॥లలోపులోనే మన మనస్సు, మన జీవితం మనం చెప్పినట్లు వింటాయి. సరైన పద్ధతిలో మనను మనం మలచుకోవలసిన కాలమది. ఈ వయస్సులో మనను మనం మలుచుకోవడం మీదనే మిగిలిన జీవితం ఆధారపడి ఉంటుంది. వర్షాకాలంలో చల్లిన విత్తనాలమీదే పంట వచ్చేంతవరకూ వ్యవసాయమంతా ఆధారపడినట్లు, యౌవనంలో

మనం తీసుకున్న నిర్ణయాలమీదా నేర్చుకున్న సత్యాలమీదా, అభ్యసించిన సత్ప్రవర్తన మీదా మిగిలిన జీవితమంతా ఆధారపడి ఉంటుంది. అందు వలననే ఈ వయస్సులో సత్పురుషులతో, సద్గ్రంథములతో సంబంధం పెట్టుకొని మిలటరీ వారివలె దీక్షగా మనని మనం తీర్చి దిద్దుకోవలసి ఉంది. లేకపోతే యౌవన వేగం మరోవైపుకి లాగి జీవితాన్ని మసకబార్చ గలదు. నీ అదృష్టం వల్ల నీకు చిన్నతనం లోనే మహాత్ముల సాంగత్యం కలిగింది. నీ జీవితాన్ని తీర్చిదిద్దుకునే అవకాశం, అందుకు కావలసిన సందేశం నీకు సిద్ధంగా వుంది. ఇదివరకటిలా కాకుండా ఇకపైన నేను నీకు తరచుగా ఉత్తరాలు వ్రాస్తుంటాను. ఇకనుండి నీవు చేయవలసినది చెబుతూ, నీకు నేర్పవలసింది నేర్పుకుంటాను.

ఆశీస్సులతో,

....................

# తలో ప్రక్కనా

చి॥సా॥...............కు ఆశీస్సులు

నీవు వ్రాసిన లెటర్ అందినది. రాలేకపోయానని బాధపడకు. మానసికంగా మనమంతా ఒక్కటిగానే ఉన్నాం. మాస్టరుగారి మనస్సనే కోనేటిలో తలోప్రక్కనా స్నానం చేస్తున్న వాళ్ళం మనం. నా యెడల మీ నుండి వ్యక్తమవుతున్న ప్రగాఢమైన ప్రేమానురాగాలే చాలు. అవే కొంతలో కొంత ఉపశమనాన్ని కలిగించి నన్ను నిలబెడుతున్నాయి.

తరచు ఉత్తరాలు వ్రాస్తుండు.

ఆశీస్సులు

....................

# తర్వాత ఎలా?

విశాఖపట్నం
చిరంజీవి...............కి ఆశీస్సులు 4-4-84

మాస్టరుగారే ఈ సన్నివేశాన్నుండి మనలను తెప్పరిల్ల చేయగల వారు. కావలసిన ఓదార్పును అనుగ్రహించగలవారు కూడవారే! భౌతిక దేహం విడవడం అనేది ఎవరి విషయంలోనైనా సహజమే! కాని మాస్టరు గారు అకాలంగా, అర్థాంతరంగా విడిచిపెట్టినట్లు కనిపించడంతో సన్ని వేశానికి సిద్ధంగా లేని మన మనస్సులు మరిగిపోతున్నాయి.

ఆయన తర్వాత ఎలా అనడానికి, ఆయన లేకపోతే కదా! ఇది వరకు దేహంలో వున్నారు. ఇప్పుడు దేహం లేకుండా ఉన్నారు. అప్పు డెలా అందరిచేతా పని చేయించారో ఇప్పుడంతకంటె ఎక్కువ చేయిస్తారు. ఆయన కార్యక్రమం విజృంభిస్తుందే తప్ప నీరసించదు. ఆ కార్య క్రమంలో ఎవరి పాత్ర ఏమిటి? అనేది ఆయనే నిర్ణయిస్తారు. ఇదివరకటి లాగానే, కాకపోతే మనకు విశేషమయిన సాధన అవసరం. మాస్టరుగారిని కళ్ళతో చూడటానికి అలవాటుపడ్డ మనం ఇప్పుడు మనస్సుతో స్పర్శగా అనుభవించడం అభ్యాసం చేయాలి. నీకు చెబుతానన్న ప్రణాళికలన్నీ నీకు చెప్పబడతాయి. ఇన్ని శరీరాలను చేరదీసిన ఆయన ఏ శరీరంతో నీతో మాట్లాడదలుచుకున్నారో ఆ శరీరం ద్వారా చెప్పబడతాయి. తరచు ఉత్తరాలు వ్రాస్తుండు. కాలమే మనని కలుపుతుంది.

ఆశీస్సులు

## ఒక ప్రారంభం

విశాఖపట్నం

చి॥..................కు ఆశీస్సులు 12-4-84

మాస్టరుగారి దివ్యసాన్నిధ్యం నిరంతరం అనుభవించుచూముందుకు సాగుదాం. భౌతికమైన సాహచర్యం ఆ సాన్నిధ్యాన్ని అనుభవించడానికి ఒక ప్రారంభం మాత్రమే! ఇదివరలో కూడ మనం పెరిగినది ఆయన స్మరణలో, ఆయన సాన్నిధ్యంలో మాత్రమే! సమర్పణ లేనిదే స్మరణ జరుగదు. స్మరణ జరుగనిదే సాన్నిధ్యం లభించదు. సమర్పణలేని భౌతిక సాహచర్యము వలన ప్రయోజనమేమి?

మీరందరూ ఇన్నిచోట్లుగా ఉన్నది మాస్టరుగారి కృషినీ, మాస్టరుగారి గురించి నేను చేస్తున్న కృషినీ అన్నివైపులా పంచడానికి ! మిషనరీ జీల్ (Missionary zeal)తో ఈ పని చేయగలగాలి. జర్మన్ భాష తప్పక అభ్యసించాలి. సంస్కృతంలో కృషి కొనసాగించాలి. అవకాశాన్నిబట్టి హిందీకూడా నేర్చుకోవాలి. మన రచనలు అన్ని భాషలలోనికి అనువదింపబడటంలో నువ్వు పెద్ద పాత్ర వహించాలి.

ఆశీస్సులు

.....................

## పరిప్రశ్న

విశాఖపట్నం

చి॥సౌ॥..................కు ఆశీస్సులు. 14-5-85

నీవు కొన్ని ప్రశ్నలు వేశావు.

'నేను, నాది, నావారు' అనే మాయాజాలంచే లేక అహంకారంచే

ంనస్సుకు తెరదించబడుతోంది. "ఎందువలన? 'నేను' అని చాటిచెప్పు కోడానికి మానవునికి ఎందుకింత ఆరాటం?"అన్నది నీ ప్రశ్నల్లో మొదటిది. ందులో రెండంశాలు ఉన్నాయి. నేను, నాది, నావారు అనిపించడాన్ని ఏమకారం అంటారు. నేను అందరిచేతా గుర్తింపబడాలి అనే ఆరాటాన్ని అహంకారం అంటారు. మమకారం వల్ల అందరికీ చెందవలసిన మనం ొందరికే పరిమితమైపోతాం. అయితే అసలది కూడా లేకపోతే ఆ కొంద ని కూడా అభిమానించం గదా! కనుక అది దైవంచేత లీలగా కల్పించ డుతోంది. అది ఉండడం తప్పుకాదు. మెల్లగా దానిని కొందరిపైనుండి అందరిపైకి విస్తృతి చెందేటట్లు చూసుకోవడమే మానవుడు చేయవలసింది. ఆ స్థితిలో అతనికి విశ్వమే తన కుటుంబమవుతుంది. మనకు కుటుంబం ఉన్నది ఎందుకు ? ఆ కుటుంబంలో తగిన శిక్షణ పొంది క్రమంగా విశ్వమే మన కుటుంబమన్న దర్శనం లభించడానికే!

ఇక అహంకారం అంటే మనం ఉన్నట్లు మనకు గుర్తుండటం, అహం అంటే నేను అని అర్థం. అహంకారం అంటే నేను ఉన్నాను అనే భావం కలగడం. ఇది ఈ అనంతమయిన విశ్వంలో మనం ఒక ప్రత్యేక మయిన వ్యక్తిగా వ్యక్తం కావడానికి పనికి వస్తోంది. నేను ఉన్నాను అని ప్రత్యేకించి గుర్తుండటం మంచిదే! అప్పుడు ఆ 'నేను'గా ఈ సృష్టి క్రీడలో మనం నిర్వహించవలసిన పాత్ర నిర్వహించడానికి వీలవుతుంది. అసలు ఇలా ఎవరి పాత్ర వారు నిర్వహించడానికి వీలు గలగడం కోసమే అహంకారమనేది వ్యక్తమవుతోంది. ఇదే దాని ప్రయోజనం. ఈ అహం కారం, మన శరీరంలో 'టెంపరేచర్' లాంటిది. అసలది లేకపోతే మనం ఉండం. అలాగని ఎక్కువైతే 'జ్వరం' అనబడుతుంది. నేనుంటాను- అన్నంతవరకు తప్పులేదు, నేనే ఉంటాను- అంటేనే ముంచుకొస్తుంది ముప్పు. నేనుంటాను. అనేవాడు మానవుడవుతాడు. నేనే ఉంటాను.

అనేవాడు రాక్షసుడవుతున్నాడు. అందరిగానూ 'నేనే' ఉంటున్నాను అన్న అనుభూతి చెందినవాడు దేవుడవుతున్నాడు. ఇదీ అహంకారం కథ!

'ఇక జీవితానికి గమ్యమేమిటన్నది'! నీ తరువాతి ప్రశ్న. 'ఆనందించడమే'నని దానికి సమాధానం. 'ఆ ఆనందించడానికి మార్గమేది? అని మళ్ళీ నీ ప్రశ్న. పెద్దలు నడిచినదారి అని దానికి సమాధానం 'ఆ దారి చూపేదెవరు?' అని నీప్రశ్న. 'అతడే నీ గురువని' దానికి సమాధానం. 'ఆ గురువెలా దొరుకుతాడు' అని మళ్లీ నీ ప్రశ్న. 'నీవు నిజంగా దారిని కోరినప్పుడు'-అని దానికి సమాధానం. ఈ సమాధానాలను సావధానంగా పొంది సంతోషాన్ని రుచిచూడడానికే ఇయ్యబడింది మానవ జీవితం. ఆ రుచి చూడబడిన సంతోషంలో నిలబడగలగడమే మానవ జీవితానికి పరమావధి. దానికి కావలసిన సాధనాలు రెండు. ఒకటి- దృఢ సంకల్పం. రెండు-ఆ సంకల్పానికి కార్యరూప మిచ్చేందుకు గాను తరుగని శ్రద్ధ ఈ రెండూ నీకు చక్కగా అలవడతాయని ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ ఇప్పటికి ముగిస్తున్నాను.

ఆశీస్సులు

..................

# మంచి స్నేహితుడు

విశాఖపట్నం

చి॥సౌ॥................కు ఆశీస్సులు. 6-6-85

నీవు వ్రాసిన ఉత్తరం అందింది. నీకు దొరికిన సమాధానం బాగుంది. అయితే నీకు ఎప్పటికప్పుడు దర్శనాలు-నిదర్శనాలు లభిస్తున్నాయన్నమాట. చాల సంతోషం. అలా ఎప్పటికప్పుడు నీకు లభిస్తూనే

ఉంటాయి, ఏసుప్రభువు ఇలా అంటాడు. "అడుగు, ఇవ్వబడుతుంది. తట్టు, తెరుచుకుంటుంది." ఈ వాక్యాలు నిజంగా నిత్య సత్యాలు. హృదయపూర్వకంగా అడగాలే గాని సమాధానం దారి చేసుకొని మరీ వస్తుంది. ఆ వచ్చే లోపున కొద్దిగా 'ఇది'గా ఉంటుంది. వాన రాబోయేముందు గాలి బిగదీయడంలాంటిదిది.

నీ లెటరు చక్కగా ఆత్మీయతతో నిండి ఉంది. నీవు నా దగ్గర చనువు తీసుకోడానికి మొహమాట పడనక్కరలేదు. గురువు అంటే ఒక మంచి స్నేహితుడని తెలుసుకోవాలి. స్నేహం ప్రేమను కోరుతుంది తప్ప గౌరవ మర్యాదలను అపేక్షించదు. కనుక నీకు అనిపించింది అనిపించినట్లు కనిపించింది కనిపించినట్లూ వ్రాసే స్వేచ్ఛ నీకు ఎప్పుడూ ఉంది. హృదయం విప్పి మాట్లాడటంలోనే నిజమయిన ఆనందం లభిస్తుంది.

ఇక నీవు ప్రస్తుత కాలంలో స్త్రీ పురుష సంబంధాలను గూర్చి వ్రాశావు. స్త్రీ పురుషులు దంపతులై ఎలా ఉంటే జీవితం రక్తికడుతుందో చి॥సౌ॥కి వ్రాసిన ఉత్తరంలోనే నేను సూచించాను. వీలయితే ఆ ఉత్తరాన్ని మరొక్కసారి చదువు. సుఖపడదల్చుకున్న జీవితాలకు మార్గమదే! సుఖపడదల్చుకోని వాళ్ళను గురించి మనం వేచి ఉండడమే చేయగల్గింది. అడిగిన వాళ్ళకు చెప్పగలం గాని అడగని వాళ్ళకు చెప్పలేం గదా ! వాళ్ళు అడిగే వరకు వేచి ఉండటమే కర్తవ్యం. అడిగిన నాడు సమాధానం తప్పక దొరుకుతుం దనడానికీ, పరిష్కారం లభిస్తుందని చెప్పడానికీ నీ 'దర్శనాలు, నిదర్శనాలు' కథే ఒక ఉదాహరణ.

మీ స్కూలు తెరిచారని తలుస్తాను. చిన్నపిల్లలతో మళ్ళీ కాలం కనబడకుండా గడిచిపోతోందని తలుస్తాను. అందరినీ అడిగానని చెప్పు. యోగక్షేమాలతో ఉత్తరం వ్రాయి.

ఆశీస్సులు

................

# ఇదీ కథ

విశాఖపట్నం
చి॥సౌ॥...............కు ఆశీస్సులు 1-11-8౹

నీవు వ్రాసిన ఉత్తరం అందుకున్నాను: నీ పిలుపులు, తలపులు అనుభూతి ప్రదంగా ఉన్నాయి. నీ భావ ప్రకటన చాలా సహజంగా నీ తత్త్వానికి తగినట్టుగా ఉన్నది. నీవు కోరినది నా నుండి ఎప్పటికప్పుడు తప్పక పొందగలవు. నీవు దర్శించిన ఆ దివ్య చైతన్యమూర్తిగా యీ నా సాహచర్యము నీకు ఎల్లవేళలా లభించగలదు. నీవు దర్శించినట్లుగా, నిజమునకు దర్శించవలసినది ఆ దివ్య చైతన్యమూర్తినే! ఆ చైతన్య మూర్తికి ఈ భౌతిక దేహము ఒక వేదిక, ఒక వాహిక, ఒక పీఠము. ఒక ఉపకరణము మాత్రమే! చైతన్యమూర్తి అయి మానవుడు ఈ దేహమును వినియోగించుకొనవలసి ఉన్నది. అట్లు వినియోగించుకోగలిగినప్పుడు అతని జన్మకర్మలు దివ్యములు. ఏమరుపాటు చెందినప్పుడు దేహమును వినియోగించుకోవలసిన మానవుడు దేహమునకు పరిమితమై దానికొరకు బ్రతుకును వెళ్ళతీస్తాడు. దేహముతో జీవించవలసినది పోయి దేహము కొరకు జీవించే దుర్గతికి లోనవుతాడు. కాలక్రమంలో పెద్దల సాహచర్య భాగ్యంచేత ఈ దుర్గతినుండి బయటపడుతూ ఉంటాడు- ఇదీ కథ! కనుక దివ్య చైతన్యమూర్తిగా నీవు పొందిన దర్శనము నిజమైనది. ఆ చైతన్య మూర్తి నీవు కోరిన రూపులో భాసించగలదు. భాషించగలదు. ప్రస్తుతం నీవు పొందుచున్న అనుభూతి అదియే!

విజయవాడలో మీ చెల్లెళ్ళను నేను కేవలము చూచి ఊరుకోలేదు. వారి మౌన సంభాషణలు వినిపించుకున్నాను. ఎవరికి తగినట్లు వారితో వారికి మాత్రమే వినబడేటట్లుగా సంభాషిస్తూనే ఉన్నాను. ఆ సంభాషణ

ఎక్కువ భాగం కన్నుల ద్వారా జరుగుతాయని నీకు అనుభవమే గదా ! మీలోని నిశితమైన వెలుగును జ్వలింపచేయడానికే అవి అనేక భంగిమలలో మిమ్ములను స్పృశిస్తూ ఉంటాయి. అయితే ఇందులో ఎవరికి తగిన భాష వారికి ఉంటుంది. అందువల్ల ఒకరికి నేను మరొకరితో మాట్లాడలేదని పించవచ్చు. అది సత్యం కాదు. నేను ఎవరి భాషలో వారితో మాట్లాడు తూనే ఉంటాను.

మొన్న మీ ఊరి పూజలలో నీ కొలీగ్ నాతో మాట్లాడటానికి వీలు లేకపోయింది. దానికి కారణం నేను సుముఖంగా లేకపోవడమని ఆమెకు అనిపించింది. కాని ఏదైనా సందర్భాన్ని బట్టి ఉంటుంది. అది ఉత్సవ సమయం. అక్కడ చూపటానికి వీలు ఉంటుంది తప్ప, చర్చించడానికి వీలుండదు. అయితే 'అనుమానాలు తీరడమెలా' అని మీకు అనిపించ వచ్చు. అక్కడ జరిగే ప్రవచనాన్ని శ్రద్ధగా వినగలిగితే చాలు. అందులో ఎవరికి కావలసినది వారికి లభిస్తుంది. ప్రవచనం అంటే కావలసిన అందరికీ కలిపి అందించే సమన్వయం. ఇంకా ఆపైన ఏమైనా మాట్లాడవలసినవి ఉన్నాయి అనిపిస్తే, దానికి మనము వేరే సమయం ఎంచుకోవలసి వుంటుంది. మీ కొలీగ్‌కు ఆ సమయం ఎప్పుడో వస్తుంది. ఆ వచ్చినప్పుడు ఆమె కూడ మనలో ఒకతె అవుతుంది.

అందరినీ అడిగినట్లు చెప్పు. వెంటనే ఉత్తరం వ్రాయి.

ఆశీస్సులతో

.....................

# ఈశ్వర సామ్రాజ్యం

విశాఖపట్నం
చి॥సౌ॥..............కు ఆశీస్సులు 1-1-86

నీవు వ్రాసిన ఉత్తరం ఇప్పుడే అందుకున్నాను. అది ఉత్తరం కాదు. పరామర్శ. ఆత్మీయమైన ఒక స్పర్శ. ఆ స్పర్శ చాలు, నా ఆరోగ్యం కుదుటపడటానికి. మీరు నానుండి పొందడమే కాదు, నేను మీనుండి పొందడమూ ఉంటుంది. రెండు బస్తాలను ఒకదాని కొకటి ఆనేటట్లుగా నిలబెట్టినప్పుడు రెండూ నిలబడతాయి. ఇందులో ఏ బస్తాపైన ఏ బస్తా ఆధారపడి ఉంది? ఎక్కువ తక్కువల సంగతి ఆలోచించడం మానేస్తే రెండూ దగ్గరగా చేరడం వల్ల రెండూ నిలబడ్డాయి. మనమూ అంతే! నాకు మీరూ. మీకు నేను, ఒకరి కొకరు.

మనస్సు ఉత్సాహంగానే ఉంది. కార్యక్రమాలు చక్కగా నడుస్తున్నాయి. కార్యక్రమాల స్పీడుకు తగినట్లుగా శరీరం కూడ సిద్ధం కావాలి కదా! అందుకుగాను కొన్ని సర్దుబాట్లు జరుగుతున్నాయి. అందువల్ల నే అలా అనారోగ్యంగా కనిపించాను. అంతే! కలిసి నడుస్తున్న మనకు అలసట ఉంటుందా! అలసట, ఆవేదన కనుక ఉంటే మనస్సు ఆవేళ ప్రవచనంలో 'రండో బాలకులార, అంటూ గొంతెత్తి పైకి ఎగిసిపడుతుందా! ప్రహ్లాదుణ్ణి గురించి చెప్తూ ఏం చెప్పాను! తనపైకి పంపబడిన విష సర్పాల్లోనూ, అతడు నారాయణుణ్ణే చూశాడు. వాటిని పంపిన హిరణ్యకశిపునిలోనూ నారాయణుణ్ణే చూశాడు. సన్నివేశాలు ఎలాంటివయినా, అతడు చూసింది నారాయణుణ్ణే కనుక అతడు నారాయణుడితోనే ఉన్నాడు. మనకిప్పుడు నారాయణుడు మన మాస్టరు గారు కనుక సన్నివేశాలన్నింటిలో ఆయన్నే చూస్తూ, ఆయనతోనే నడుద్దాం. అప్పుడు కృంగిపోవడమూ ఉండదు.

పొంగిపోవడమూ ఉండదు. రాగద్వేషాల కసలు తావుండదు. ఏమంటావు ఆ రోజు ప్రహ్లాదుని కథను స్మరించడం ద్వారా మనం ప్రవేశించింది ఈ స్థితిలోనికే ! దీన్నే ఈశ్వర సామ్రాజ్యం అంటారు.

ఉన్నది ఒకే సామ్రాజ్యం! మన మనస్సుతో నడిస్తే ఇది మానవ సామ్రాజ్యం. ఆ మాధవుడితో నడిస్తే ఈశ్వర సామ్రాజ్యం. ఈ ఈశ్వర సామ్రాజ్యానికి వారసులు కావలసిందిగా ప్రబోధించడానికే ఆ కాలంలో ప్రహ్లాదుడు, ఈ కాలంలో ఏసుప్రభువు దిగివచ్చారు. వాళ్ళ మాటలకు దగ్గరైతే వాళ్ళు నడచిన బాట మనకు గోచరిస్తుంది. ఆ మాటలు చెప్పుకుంటూ, ఆ బాట వెంట ముందుకు సాగుదాం.

"వారేమి చేయుచున్నారో వారెరుగరు. వారిని క్షమించు తండ్రీ!" అన్నాడు ఏసుప్రభువు: తనను హింసిస్తున్న వారిని గూర్చి దైవానికి చెబుతూ, ఈ వాక్యం మన కిప్పుడొక మంత్రం. ఈ మంత్రాన్ని ఊతగా తీసికొని మనం మెల్లిగా ఏసుప్రభువు, ప్రహ్లాదుడు పొంది ఉపదేశించిన స్థితి అయిన ఈశ్వర సామ్రాజ్యంలోనికి కలిసి ప్రవేశిద్దాం. నిజానికి మనం ప్రవేశించాం. ప్రవేశించకపోతే ఇలా అనుకోవడమెలా సాధ్యమవుతుంది? ప్రవేశించినప్పుడే ఇలా అనుకోవడానికి సాధ్యమవుతుంది.

ఉదయ ప్రభకు నీకు తగినట్లుగా సమయాన్ని కేటాయించు. దాని కెట్టి అభ్యంతరం లేదు. అనుభూతి ప్రదంగా సాగడమే కావలసింది? నీవు పొందుతున్న అనుభూతే నీకు అనుమతి.

'నా కార్యక్రమ మేమిటి ? నా ప్రణాళిక ఏమిటి?' అని అడిగావు. కార్యక్రమం దానికదిగా నడిచి వస్తున్నప్పుడు ప్రణాళిక దానికదిగా దర్శన మిస్తున్నప్పుడు ఇంకీ ప్రశ్న ఎందుకు? సమాధానం ముడిపడితే ప్రశ్న అవుతుంది. ప్రశ్న విడివడితే సమాధానమై భాసిస్తుంది. ఏమంటావు? ఎదురుగా గోచరిస్తున్న కర్తవ్యాన్ని నిర్వహిస్తున్న కొద్దీ దారి దాని కదిగా

పొడగడుతుంది. ఇప్పుడు 'ఉదయప్రభ' మీ మధ్యకు రాలేదా! అలాగే అన్నీనూ !

ఉదయ ప్రభ మీ హృదయ ప్రభ అయి ప్రకాశించు గాక!

ఆశీస్సులతో

..............

# అమృత మథనం

విజయవాడ

ప్రియ సోదరులకు, 10-2-86

ప్రేమతో కృష్ణస్వామి వ్రాయునది.

ప్రస్తుతం అక్కడ అమృతమథనం సాగుతున్నది. ధనం జీవితానికి గమ్యంగా గోచరించినప్పుడు అంతరంగంలో మథనంతప్పదు. ధర్మం జీవితానికి గమ్యంగా గోచరించి ఆ అమృత స్థితి అందేవరకు ఈ మథనం సాగుతూనే ఉంటుంది. వివేకవంతునికి ధనం జీవిత కార్యాన్ని నడిపించే ఇంధనంగా ఉపయోగిస్తుంది. వివేకాన్ని కోల్పోయిన వానికి ధనం ఆశను రగిలించి భీతిని కలిగించి అంతరంగమథనానికి దారి తీస్తుంది. చూద్దాం! ఆ మథనంలో మనవాళ్ళు విజయంసాధిస్తారని ఆశిద్దాం.

"కోర్టు గొడవలు ఎంతవరకూ వచ్చాయి? రంగాలుదాటి ఆ నాటకానికి తెర పడేదెప్పుడు?" అని మీ మనస్సు త్వరపడుతోంది. సన్నివేశాలను సాధనలో భాగాలుగా స్వీకరించండి. మనస్సుని కూడదీసికొని ధర్మాన్ని మీతో కూడాతీసికొని ముందుకు సాగండి. విజయం మనదే!

ప్రేమతో

................

# అశ్రద్ధ చేయవద్దు

విజయవాడ
10-2-86

చి॥సౌ॥...............కు ఆశీస్సులు

'శరీర మాద్యం ఖలు ధర్మసాధనం' అన్నారు. మనం ఆచరించవలసిన ధర్మాచరణకి మూలమైనది శరీరమే కదా! కనుకనే 'ఆరోగ్యమే మహాభాగ్యం' అన్నారు. మహాభాగ్యం అని ఎందుకన్నారంటే, ఈ మహాభాగ్యం లేకపోతే ఏ భాగ్యమూ మనకు వినియోగపడలేదు కనుక! ఆధ్యాత్మికత పేరిట ఆరోగ్య విషయం అశ్రద్ధ చేయకూడదు. తుపాకిని సరి చూసుకోకుండా దేశ రక్షణను గురించి కలగంటున్న సైనికుడు, దేశాన్ని ఎంత రక్షించగలడో, శరీర ఆరోగ్యాన్ని పట్టించుకోకుండా ఆధ్యాత్మికత పేరిట ఆశ మాలను వల్లించిన వాడు కూడ లోక శ్రేయస్సును అంతే సాధించగలడు.

శరీరాన్ని కాపాడుకోవడమే జీవితానికి గమ్యం అనుకుంటారు కొందరు. వారు శరీరానికి పనిచేసి పెట్టగలరు కాని, శరీరంతో లోకానికి పనిచేయలేరు. శరీరాన్ని అశ్రద్ధ చేయడమే సాధనకు పరమావధి అనుకుంటారు కొందరు. వారు సాధన పేరిట అనుభవించేది వేదనే ! ఇంతకూ చేయవలసింది ఏమిటి ? శరీరాన్ని కాపాడుకోవడం-జీవితానికి గమ్యంగా కాక, సాధనకు ప్రారంభంగా రూపొందాలి.

ప్రస్తుతం నీవు నీ శరీరాన్ని, కుటుంబ సభ్యుల శరీరాలను సాధనకు తగిన వేదికలుగా సరిదిద్దుకోవలసి ఉన్నది. కొంచెం శ్రద్ధ పెట్టు. శరీర ఆరోగ్యాన్ని గురించి కూడా నన్ను అడగవలసి వచ్చిందని బాధపడకు. సాధనకు తగిన వేదికను అమర్చి ఈయడం కన్నా శిష్యునకు గురువు చేయగలిగినది ఏమున్నది!

దూరాన ఉన్నానని బాధపడవద్దు. సూర్యునికీ, పద్మానికీ మధ్య 'దూరం' అడ్డు పడగలిగిందా? ఒక్కసారి మనసిచ్చుకుంటే చాలు. ఇక అది ఎక్కడున్నా విచ్చుకుంటూనే ఉంటుంది. మనపని ఎక్కడఉంటుందో,మనం అక్కడ ఉంటాం. నీద్వారా అక్కడ పని జరుగవలసి ఉన్నదన్నమాట.

అందరిని అడిగినట్లు చెప్పు. ఏమని అడిగినట్లు? నాతో ఉండమని అడిగినట్లు. అప్పుడు మీ యోగక్షేమాల బాధ్యత నాది.

ఆశీస్సులు

....................

# దారిన పడటానికి

విజయవాడ

చిరంజీవి...............కి ఆశీస్సులు 10-2-86

నీవు వ్రాసిన ఉత్తరం అందింది. యోగాన్ని అభ్యసించాలన్న నీ కోరిక తీరుతున్నందుకు సంతోషంగా ఉంది. దొరికిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకో. అక్కడి మన సోదర బృందం అందరినీ అడిగి నట్లు చెప్పు.

'మనస్సుకు దిగులు కలుగుతోంది' అని వ్రాశావు. మనస్సుంది మనం దారిన పడటానికి గాని, దిగులు పడటానికి కాదు. క్రమంగా పరిస్థితు లన్నీ దారికి వస్తాయి. యోగ సాధనకు అవకాశం దొరికినట్లే, కుటుంబంలో కావలసిన పనులు కూడ వాటి కవిగా నెరవేరుతాయి. దిగులుపడటం మాని చేయవలసింది చేయి.

ఆశీస్సులు

....................

## మన మంచికే

విజయవాడ
27-6-86

పూజ్యులు............గారికి ప్రేమతో కృష్ణస్వామి వ్రాయునది.

కాలము చిత్రమైనది. తిరుగుచున్న మలుపు ఎచ్చటికి దారి తీయునో తెలియజెప్పవలసినది అదే! ఏది ఏమయిననూ అన్నియు మన మంచికే! కాని కొన్ని సన్నివేశములు తట్టుకొనుటకు కష్టమై తోచును. మన శ్రేయస్సుకోరిన కాలము, మన ఇష్టముతో పని పెట్టుకోకుండగ సాగిపోవు చుండును.

ప్రేమతో

.................

## మధురానుభూతి

విజయవాడ

................కు ప్రేమతో కృష్ణస్వామి వ్రాయునది 27-6-86

ఎక్కడనుండి తమకై ఎంతెంత తీసికొనవలెనో మాస్టరు గారికి తెలియును. అట్లే అన్ని వైపులనుండి అన్నియు నడిచివచ్చి గురు పూజలు నిండుగా జరిగినవి. పెద్దలెందరో మాస్టరుగారి సన్నిధిలో తమ వంతు పాత్రను పోషించినారు. ఆ మూడు రోజులు సోదర బృందమందరూ మాస్టరుగారి దివ్య తేజమను సరస్సున ఈదులాడినారు. అది ఒక మధురానుభూతి.

ప్రేమతో

................

## కలవరము - కల'వరము'

విజయవాడ

ప్రియతములకు శుభాశీస్సులు! 17-9-86

మీకెట్లు శ్రేయస్సో అట్లు చేయుట నా ధర్మము. నా చేతలకు ఈ లోక దృష్టిలో అంచనాలు వేసినచో మీకు మిగులునది కలవరము. చూడగలిగిన దృష్టి ఒకటి మీకు కలదు. దాని నుపయోగించినపుడు నా చేతలన్నియు మీకు కల'వరము'. ఆ దృష్టిని ఉపయోగించినపుడు నేను బోధపడగలను. నేనేది చేసినను మీ కొరకేనని గ్రహింపుడు. మీరు కోరి నట్లుగాక, మీకు శ్రేయస్సు ఒనగూడునట్లు నేనుందును. బాధతో మీరు తిట్టిననూ అవి నాకు స్తోత్రములే కాగలవు. మీ స్తోత్రములు నాకు వినబడు చునే యున్నవి. మీకు శుభమగు గాక.

ప్రేమతో

....................

## మనకు అందించడానికే

విజయవాడ

చిరంజీవి................కు ఆశీస్సులు. 12-2-87

ప్రయత్నించడంలోనే మనిషి పెరుగుతాడు. కనుక దైవం తాను పెంచదలుచుకున్న వారిని నిరంతరం ప్రయత్నించే స్థితిలో పెడతాడు. ఇలా ప్రయత్నించడాన్నే సంస్కృతంలో ఉద్యోగం అంటారు. ఉద్యోగం అంటే 'జాబ్' అన్న అర్థం సరియైనది కాదు. ఉద్యోగంఅంటే ప్రయత్నం. ఉద్యోగం పురుష లక్షణం అంటే పురుషుడు అనగా మానవుడు నిరంతరం

ప్రయత్నించే శీలంకలవాడై ఉండాలని అర్థం. సరిపెట్టుకొని చతికిలబడటం పురుషుడు చేయకూడని పని.

ఈ ప్రయత్నించటాన్ని కొందరు సాధనగా స్వీకరిస్తారు. వారు క్రమంగా యోగులవుతారు. ఇంకొందరు వేదనగా భావిస్తారు. వారు సంసార జీవులై సతమతమవుతూ ఉంటారు. జీవితాన్ని వేదనగా గాక సాధనగా మనం స్వీకరించగలిగే శిక్షణను మనకు అందించటానికే పెద్దలు ఉన్నది.

పెద్దల సాన్నిధ్యం లభిస్తే కష్టాలు మరి ఉండవు అని అంటారు. అంటే పరిస్థితులన్నీ పారిపోతాయి అని అర్థం కాదు. ఆ పరిస్థితులను కష్టాలుగా చూడటమనే స్థితినుండి మనం బయటపడతామని అర్థం.

పెద్దల సాన్నిధ్యాన్ని పుష్కలంగా పొందుతున్న అదృష్టవంతుడవు నీవు. జీవితం ప్రయోజనకరముగా తప్పక తీర్చి దిద్దుకొనగలవు.

ప్రేమతో

....................

# పెద్దల మార్గము

విజయవాడ

చిరంజీవి............కి,

28-2-87

నీవు వ్రాసిన ఉత్తరం అందినది. నీ మనస్సు ఎంతవరకు సిద్ధపడుతున్నదో అంతవరకు అనగా ఆ మేరకు మాస్టరుగారి కార్యక్రమం చేపట్టు. సిద్ధపడినంత వరకు చేయుచుండుట మన కర్తవ్యము. ఇంకనూ ఆపైన సిద్ధపడగలుగుట అది మాస్టరుగారి అనుగ్రహమునకు సంబంధించిన

అంశము. సిద్ధపడలేక పోవుచున్నానని బాధపడవలదు. సిద్ధపడినంత వరకు నీ జీవితము సద్వినియోగము చేయుటయే నీవు చేయగలిగినది. మీరు చేయు చున్న పనికి దోహదము చేయుట నా కర్తవ్యము. అంతకుమించి బల వంతము చేయుట నానుండి జరగదు. కాని సూచించుట మాత్రము నేను చేయుచుందును. నేను సూచింపనిచో నీకు భావి కార్యక్రమము ఎట్లు బోధ పడగలదు? ఎప్పటికైన నీవు నానుండి వెలువడుచున్న కార్యక్రమములో తాదాత్మ్యము చెందవలసిన వాడవే! సమయము పట్టవచ్చును. అదీ సాధనకు పనికివచ్చును.

నేనెప్పుడునూ నీతో ఉన్నాను. నీవు ఎంతగా ఉపయోగించుకొనిన అంతగా ఉపయోగపడుటకు సిద్ధంగా ఉన్నాను. నా కందరూ ఒక్కటే! నా దృష్టిలో ఎక్కువ తక్కువలు ఉండవు. కాని ఉపయోగించుకొనువారు మాత్రం వారి వారి శక్తి కొలదీ నన్ను వినియోగించుకొనుచున్నారు. ఇది సహజము. ఇందు తప్పు పట్టవలసిన పనిలేదు. తప్పుపట్టినచో సృష్టి తత్త్వము తెలియనివారగుదురు.

తమ దృష్టి ప్రకారము కాక సృష్టి ప్రకారము నడుచుకొనుట పెద్దల మార్గము. ఆ పెద్దల మార్గమున ప్రవేశించుచున్న నీకు ఇప్పటికే అది తగుమాత్రము బోధపడి ఉండును. నీకు క్రమశిక్షణ కలదు. సద్బుద్ధి కలదు. పెద్దల యెడల విధేయత కలదు. ఇక అబ్బవలసినది సాహసము. క్రమముగా అదియును అబ్బగలదు. నాకు ఆ విశ్వాస మున్నది.

నీవు అనుకున్నట్లుగా మాస్టరుగారి కార్యక్రమములో పాలుపంచు కొనుట ప్రారంభించుము. తగిన కార్యక్షేత్రమును స్వీకరించి ముందుకు సాగుము. ఒకసారి ఇక్కడకు వచ్చి ప్రణాళికను స్వీకరించుము.

ఆశీస్సులతో

....................

# రెండు భాగాలు

విజయవాడ
చిరంజీవి...............కి ఆశీస్సులు. 18-3-87

దినచర్యలో క్రమబద్ధతను కోరి పాటించుట ఒక్కటే మనస్సు మన స్వాధీన మగుటకు మార్గము. యోగాభ్యాసమున మన పెద్దలు చెప్పిన యమనియమాల సారాంశమిదే! కనుక దిన చర్యను క్రమబద్ధము చేసు కొనుటలో శ్రద్ధపెట్టగలవు.

దిన చర్యను మనము శ్రద్ధగా గమనించగలిగినచో అందులో రెండు భాగములున్నట్లు మనకు తెలియగలవు. మొదటి భాగము మనము మన శరీరమునకు చేసిపెట్టవలసిన పనులు. రెండవ భాగము ఆ శరీరముతో లోకమునకు చేసిపెట్టవలసిన పనులు. ఈ రెండు విభాగములను సమతూక మున నడుపుకొనుట మనిషికి చేత కావలసి ఉన్నది. శరీరమునకు కావలసిన పనులకే ప్రాధాన్యమిచ్చినచో మనము ఈ లోకమునకు దిగి వచ్చినందుకు అర్థము లేకుండా పోవును. శరీరముతో లోకమునకు చేసిపెట్టవలసిన పను లకే ప్రాధాన్యమిచ్చినచో శరీరము నిర్లక్ష్యము చేయబడి ఆ పనులను చేసి పెట్టుటకు సహకరించలేని దుర్బలస్థితికి దిగజారిపోవును. కనుకనే ఈ రెండు విభాగములను సమతూకమున నడుపుకొనుటలో మనము కౌశలము చూపవలయును. ఈ సమతూకము సిద్ధించుటకు కావలసిన అంశములే యమనియమములను యోగాంశములుగా మన పెద్దలచేత ఉపదేశింప బడినవి.

కనుక మనము దినచర్యను శ్రద్ధతో గమనించి ఎప్పటికప్పుడు తీర్చిదిద్దుకొనవలసి ఉన్నది. మనము నేర్వవలసినది ఒక్కటే. అది ఏమనగా మనను మనస్సు గమనించుచుండుట, గమనించుట ప్రారంభించితి

మనగా మనలో యోగసాధన ప్రారంభమయినదన్నమాట. గమనికకు వచ్చిన అంశములను సరిజూచుకొనుట మొదలిడిన కొలది యోగమార్గమున మన ప్రయాణము వేగముగా సాగగలదు.

విశాఖలో నీవు నన్ను చేరవచ్చి నమస్కరించిన క్షణమునుండి నీలో నిన్ను నీవు గమనించుకొనుట ప్రారంభమయినది. కనుకనే క్రమముగా నీ జీవితము చక్కబడి ఎందరికో అందని ప్రశాంతత సులభముగా నీకు చిక్కినది. ఈ అందిన ప్రశాంతతను ఉచితముగా తీసికొని నిన్ను నీవు గమనించుటను మరింత శ్రద్ధతో కొనసాగించు చుండగలవు. ఇహపరములను సాధించుకొనుటలో చాకచక్యము చూపి వర్థిల్లగలవు.

అందరినీ అడిగినట్లు చెప్పుము. నా ఆశీస్సులు మీ కెప్పుడూ ఉన్నాయి. ఎప్పుడూ ఉంటాయి.

ఆశీస్సులతో

..................

# దివ్యోత్సాహము

విజయవాడ

చిరంజీవి............కి ఆశీస్సులు 16-4-87

మానసికమైన నీరసము ఒకటి నిన్ను ఆవరిస్తున్నది. కొద్ది రోజులలోనే అది సర్దుకుపోతుంది. పరీక్షలు చక్కగా వ్రాయగలుగుతావు. ఉత్సాహముగా జీవించడమంటే ఏమిటో ఇకపైన నీవు రుచి చూడబోతున్నావు. నాకనిపిస్తుంది కదా - మోక్షమంటే అదే! ఉత్సాహంగా జీవించగలగటం కన్నా మోక్షమన్నది ఇంకా వేరుగా ఏమున్నది!

అయితే ఆ ఉత్సాహము ఎలా కలుగుతుంది అన్నది ప్రశ్న! నిజమైన ఉత్సాహము మనకు కలగాలి అంటే ముందు మనమెవ్వరమో

మనకు తెలియాలి. మనము ఎవరమో మనకు తెలిసినప్పుడు ఇంక భీతి అన్నది మనకు కలుగదు. నిరాశా నిస్పృహాలు మన నిఘంటువున ఉండవు. ఫలాపేక్ష అన్నది కలగమన్నా కలగదు. నిర్దేశింపబడిన కార్యక్రమ నిర్వహణలో కావలసిన కౌశలాన్ని నిరంతరం అభ్యసిస్తూ ఉండటంలో నిత్య నూతనమైన ఒకానొక దివ్యానుభూతి కలుగుతూ ఉండగా జీవితం నడిచి పోతూ ఉంటుంది.

ఇక మరొకటి ఉన్నది మనమెవరమో మనకు తెలిసిన వెనుక ఆ మనకు తగినట్లుగా మన మనస్సునూ, ఇంద్రియాలను, మిగిలిన దేహ భాగములను మనము నిరంతరము మలచుకొనుచూ ఉండవలసి ఉన్నది. ఈ మలచుకొనుటకు చేయు ప్రయత్నమునే మన పెద్దలు యోగ సాధన అని పిలిచినారు. ఈ యోగసాధన సక్రమముగా సాగుచున్న కొలది మనస్సుకన్న పై లోకములలో వెల్లివిరియుచున్న ఉత్సాహము దేహపర్యంతము దిగి రాగలదు. ఇట్లు ఆ దివ్యోత్సాహము దిగివచ్చుటనే అవతరణమని మన పెద్దలు నిలిచినారు. అనగా, ఈ దేహమను భూమి పైన దైవ స్వరూపము దివ్యోత్సాహముగా అవతరించి నదన్నమాట, దీనినే ఉదయము ప్రేయరులో మనము May Christ return to Earth, (మే క్రైస్ట్ రిటర్న్ టు ఎర్త్) అని చదువు కొనుచున్నాము. చూచితివా! సంప్రదాయములు వేరైననూ సత్య దర్శనము ఒకటే సుమా!

అట్టి దివ్యోత్సాహము ఇకపైన అనుక్షణము అనుభవమునకు రాగలదు. నీ జన్మ కర్మలు దివ్యములై లోకహితముతో శ్రుతి కలిపి సార్థకతను పొందగలవు. ఈ నీ పుట్టుక ధన్యము కాగలదు.

ఆశీస్సులు

................

# తండ్రి ఆజ్ఞ

విజయవాడ

చిరంజీవి...............కి ఆశీస్సులు

నీవు వ్రాసిన ఉత్తరం అందినది. పరిస్థితులు బోధపడినవి. అంతా కాల మహిమ. కలి ప్రభావం. ఏసుప్రభువు విషయంలో అతని శిష్యులు ప్రవర్తించిన తీరు ఇప్పుడు మళ్ళీ కళ్ళకు కడుతోంది. శిలువ కొట్టడం పూర్తయింది. శిలువపైనుండి లేచి తండ్రి కార్యాన్ని నిర్వహించడం మరల ప్రారంభమయింది. ఆ తండ్రి ఆజ్ఞ మేరకు ఈ కార్యక్రమం ఇలా నిర్విఘ్నంగా కొనసాగుతూనే ఉంటుంది.

ఆ విషయంలో నుండి నీ వొక్కడవు బయటపడి, హృదయంతో పలికినందుకు, గొంతెత్తి చెప్పినందుకు చాలా ఆనందంగా ఉన్నది. కేంద్రం ఏమైపోయినా ప్రమాదం ఏమీ లేదు. నీలో మేలుకొనవలసిన కేంద్రం మేలుకొన్నది. సంతోషము. వ్యవసాయదారుడు పొలమును పండించి, పంటను ఈవలకు తెచ్చుకున్నట్లు, నేను మిమ్ములను ఒక్కొక్కరినే నా దగ్గరకు చేర్చుకొనుచున్నాను. పొలం అక్కడే ఉండనీ! పొల్లు కూడా అక్కడే వుండనీ! పంట నా చెంతనే ఉన్నది కదా! నాకదీ చాలును.

మాయ చాలా చిత్రమయినది. మనను క్రమ్మినట్లే క్రమ్ముతుంది. ఎందుకో తెలుసా! మనం దారి తప్పుతామో తప్పమో చూద్దాం అని! తప్ప లేదనుకో సంతోషించి తండ్రికి మనను అప్పజెబుతుంది. దారి తప్పా మనుకో తండ్రి, గుర్తుకు వచ్చేంతవరకు మనస్సును మథనంపాలు చేస్తుంది. ఎటు తిరిగీ తండ్రిని చూపించేంత వరకు ఆ మాయ నిద్రపోదు.

నిజానికదీ మాయ కాదు మాత. మనను సరిచేసి, తండ్రి కప్పగించ డానికే ఆ తల్లి ఉన్నది. ఆ తండ్రి కప్పగించే లోపునే ఈ తల్లడిల్లడం

అంతా! ప్రస్తుతం నీ సోదరులు మాయ దట్టముగా క్రమ్మిఉన్నారు. తమ తండ్రిని పరాయివానిగా భావించడంలోపోటీ పడుతున్నారు. తమ రక్షకుడిని శిలువ కొట్టుకోవడంలో నైపుణ్యం చూపించగలిగామని మురిసిపోతున్నారు. కాని ఆ రక్షకుడు తన తండ్రిపైపే చూస్తున్నాడని, ఆ తండ్రి ఆశీర్వాదంతో అంతర్యామియై ప్రకాశిస్తాడని వారు గ్రహించలేకపోతున్నారు. నేననగలిగినది ఒక్కటే! 'వారేమి చేయుచున్నారో వారెరుగరు. వారిని క్షమించు తండ్రీ!' అని!

విశ్వాసం కలిగిన వారెవరో నిగ్గు తేల్చుటకే ఈ పరీక్ష. నీవు నెగ్గినందుకు సంతోషము.

ఆశీస్సులతో

................

## మూడు అర్హతలు

విజయవాడ

చిరంజీవి............కు ఆశీస్సులు 18-9-88

నీ ఆరోగ్యం ఎలా ఉన్నది? మందును కంటిన్యూగా వాడుకోవలసింది. ఆరోగ్యం సరిచేసికోవడం మన కార్యక్రమ నిర్వహణకు మొదటి అర్హత అవుతుంది. దిన చర్యను క్రమబద్ధం చేసుకోవడంలో జాగరూకత బూనడం అనేది రెండవ అర్హత అవుతుంది. క్రమబద్ధమవుతున్న దిన చర్యను లోకహితానికి అనుగుణంగా మలచుకోవడానికి కృషి చేయడం అన్నది మూడవ అర్హత అవుతుంది. ఈ మూడు అర్హతలకై నిరంతరం వివేకంతో ప్రయత్నిస్తున్నవాడు మన ఉద్యమానికి చెందిన ఒక కార్యకర్తగా రూపొందగలుగుతాడు.

ఆలోచనలలో పడి కాలాన్ని వృథా చేసికోవద్దు. ఆచరణలో పడి కాలాన్ని సార్థకం చేసుకో! ఇక్కడే చిన్న ఇబ్బంది ఉంది. మనిషికి పట్టు చిక్కవలసింది ఇక్కడే! ఆలోచన నుండి ఆచరణకు ఉన్ముఖ మవుతున్నప్పుడే!

ఆలోచన వేరు. వ్యూహ రచన వేరు. అనగా థింక్ చేయడం వేరు. ప్లాన్ చేయడం వేరు. అనారోగ్యవంతుడు థింక్ చేస్తాడు. ఆరోగ్యవంతుడు ప్లాన్ చేస్తాడు. ఏది థింకింగో ఏది ప్లానింగో మనకు బోధపడిననాడు మన జీవితం ఇక దారిన పడినట్లే ! థింక్ చేస్తున్నవాడు కాలాన్ని వృథా చేసుకుంటున్నాడన్నమాట. ప్లాన్ చేస్తున్నవాడు కాలాన్ని సద్వినియోగం చేయగలడు. పెద్దవాళ్ళనుండి మనం నేర్చుకొనవలసింది ఈ సూక్ష్మమే! ఈ సూక్ష్మాన్ని జీవితంనుండి జీవితానికి ప్రవహింపచేసేటందుకే గురుశిష్య సంప్రదాయం.

కనుక యోగక్షేమాలతో ఎప్పటికప్పుడు ఉత్తరాలు వ్రాస్తూ ఉండు. జరుగుతున్న విశేషాలను తెలియచేస్తున్నప్పుడు కావలసిన 'గైడెన్స్' నీకు లభిస్తూ ఉంటుంది. బద్ధకించడం అనే స్థితినుండి బద్ధకంకణులయ్యే స్థితికి నేటి యువతరం ఎదగవలసి ఉంది.

ఆశీస్సులు

................

# పెద్ద ఎత్తున

విజయవాడ

ప్రియ సోదరుడు............కు ప్రేమతో వ్రాయునది 18-9-88

ప్రేయరులో మీ కుటుంబ సభ్యులు దివ్యానుభూతులను పొందుతూ దినచర్య కొనసాగించడం జరుగుతూ ఉన్నదని వ్రాశావు. మాస్టరుగారి

అనుగ్రహం మీ కుటుంబ సభ్యులపై వర్షిస్తూ ఉన్నది. వారి అనుగ్రహ బలంతో లోకహిత కార్యక్రమాలను కూడా మీరు పెద్ద ఎత్తున సాధించగలరు.

మీ పెద్దలూ, మీ శ్రీమతి తరపున పెద్దలు ఆధ్యాత్మిక మార్గాన పెద్ద ఎత్తున ప్రయాణం చేసినవారు కావడం మీ అదృష్టం. వారు ప్రారంభించిన ప్రయాణాన్నే మాస్టరుగారి సారథ్యంలో మీరిప్పుడు కొనసాగిస్తూ వున్నారు.

నిరంతరం జరుగుతున్న ప్రార్థనతో మీ కుటుంబం ఒక శక్తి ప్రసరణ కేంద్రం కావాలి. ఆ ప్రాంత ప్రజలకు శ్రేయస్సును అందించే ఒక కల్పవృక్షంగా మీ గృహవాటిక రూపొందాలి. మానవ జీవితానికి పరమార్థమేదో అది మీకు నిత్యానుభవం కావాలి.

కుటుంబ సభ్యులకు, ఆ ప్రాంత ప్రజలకు నా ఆశీస్సులు.

శుభాకాంక్షలు

.................

## వినియోగం

విజయవాడ

ప్రియ సోదరులకు ...........ప్రేమతో వ్రాయునది 4-3-89

కాలం చిత్రమైనది. అదే ముడులు వేస్తుంది. మళ్ళీ అదే ముడులు తీస్తుంది. ఈ నా పాత్రయొక్క నియోగమేమిటో, వినియోగమేమిటో ఆ కాలమే తెలియచెప్పాలి. తప్పక తెలియజెబుతుంది.

శుభాకాంక్షలు

... ............

# పెద్దలే ప్రమాణం

విజయవాడ

శ్రీ...........గారికి నమస్కరించి వ్రాయునది 9-3-89

ప్రేమతో మీరు వ్రాసిన ఉత్తరం అందింది. ఆంధ్రపత్రికలోని వ్యాసం మీకు నచ్చినందుకు సంతోషంగా ఉంది. జరుగుతున్న కృషికి, ఆ కృషి యొక్క సార్థకతకు మీవంటి పెద్దలే ప్రమాణం. పెద్దల ఆశీస్సులే ఉద్యమానికి పునాదులు. ఉద్యమ విజయాలను సూచించే సంకేతాలు కూడా అవే! కనుక మీ ఉత్తరం చూచి సంతోషమైంది.

నమస్సులతో

...............

# కోరుకుంటున్నాను

విజయవాడ

ప్రియమిత్రుడు...........కు ప్రేమతో వ్రాయునది. 12-11-89

న్యాయవాదిగా రాణిస్తూ, ప్రజల అభిమానాన్ని నిండుగా పొంది వారి సేవకు అంకితమై పని చేస్తున్న నీ జీవితం ధన్యం. నీవు ప్రజల శ్రేయస్సును మరింతగా సాధించడానికై ముందు ముందు మరింత ఉన్నత పదవులను అధిష్ఠించగలవని ఆశిస్తున్నాను. పదిమంది కొరకు బ్రతికిన బ్రతుకే బ్రతుకు. తన కొరకు మాత్రమే బ్రతుకదలచిన వారి బ్రతుకు ఈ భూమికి బరువు.

మరొక చిత్రమేమంటే నీవు పుట్టినచోట నీవు ఆరాధింపబడటం. ఇది చాలా అరుదుగా జరుగుతుంటుంది. విద్యావంతులైనవారు తాము ఏ

ప్రాంతాలకు చెంది ఉన్నారో ఆ ప్రాంతాలకు తరలివెళ్ళి నీలాగా పని చేయగలిగితే మన దేశం అభివృద్ధి చెందడానికి చాలా కొద్దికాలం సరి పోతుంది. పుట్టినచోటు నుండి పొట్ట పట్టుకొని దూర ప్రాంతాలకు, దేశాలకూ తరలివెళ్ళి అక్కడ స్థిరపడిపోయి, భోగ భాగ్యాలననుభవించే వారి కన్నా విద్య పూర్తి చేసుకొని ఆ విద్య వలన లభించిన వికాసాన్ని, నైపుణ్యాన్నీ సద్వినియోగం చేసేందుకు తాను పుట్టిన ప్రాంతానికి తరలివెళ్ళి ఆ పుట్టిన ప్రాంతానికీ, తాను పుట్టిన దేశానికి తద్వారా యావత్ప్రపంచానికి సేవ చేయగలిగిన వారు ధన్యులు. మా స్వగ్రామానికి ప్రక్కగా ఒక చిన్న పల్లెటూరు ఉన్నది. ఆ పల్లెటూరునుండి సంవత్సరానికి ముగ్గురు నల్గురైనా పెద్ద చదువుల కోసం దూర ప్రాంతాలకూ, దేశాలకూ వెళుతూ ఉంటారు. కాని అలా వెళుతూ ఉండటమే గాని వెళ్ళిన వాళ్ళలో నుండి ఒక్కడు కూడా తిరిగివచ్చి ఆ పల్లెపట్టును పట్టించుకున్న పాపాన పోలేదు. ఇప్పటికి కూడ ఎక్కడో ఉన్న వారికోసం ఆ పల్లెపట్టు నుండి పప్పులు, కారాలు, జంతికలు, సున్నుండలు నడచి వెళుతుంటాయి. నీవు వ్రాసిన ఉత్తరం చూడగానే ఆ పల్లెటూరి కథ గుర్తుకు వచ్చింది. ఆ వూళ్ళో కూడా ఇలా జరిగితే ఎంత బాగుండును !

మిత్రుడా! నీవు చేస్తున్న కృషి నాకు ఎనలేని తృప్తిని కలిగిస్తున్నది. నీలాంటి వారి సంఖ్య పెరగాలని మనసారా కోరుకుంటున్నాను.

ప్రేమతో

................

# త్రివేణీ సంగమం

విజయవాడ

చిరంజీవి............కు ఆశీస్సులు! 12-11-89

చక్కగా చదువుకుంటున్నావు కదా ? పెరిగి పెద్దవాడవై ఇటు కుటుంబానికీ, అటు దేశానికీ పనికివచ్చేవాడివిగా ప్రయోజకుడిలా నీవు

రూపొందాలి. మంచి ఆశయాలు ఉండటం మంచిదే! ఆ ఆశయాలను జీవితంగా మలచుకొనేటందుకు మనం చాలా శ్రద్ధతో కృషిచేయవలసి ఉంటుంది.

జిడ్డు కృష్ణమూర్తిగారు ఒక చోట అంటారు-'ఆశయాలను వల్లిస్తున్నామంటే ఆచరణను వాయిదా వేస్తున్నాము' అని అర్థం చేసుకోవలసి ఉంటుంది'-ఈ వాక్యం చాలా అర్థవంతమైనది. ఇలా చేస్తే బాగుండును ఇలా వుంటే బాగుండును అంటే ఏమిటర్థం? అలా ఇప్పుడు చేయడం లేదనే! అంతేగా! ఈ సత్యాన్నే ఆయన అలా తెలియజెప్పారు. కనుక చిన్నతనం నుండి ఆశయాన్ని జీవితంగా మలచుకునే అలవాటును మనం చేసుకోవాలి.

ఇంకొక్కమాట. తెలివితేటలు ఉండటం ఆనందించదగిన అంశమే! అయితే ఆ తెలివి తేటలకు తగిన విధేయతకూడ మనస్సుకు అలవడాలి. ఆ విధేయతకు తగిన కృషిని చేయటానికి కూడ మనం అలవాటు పడాలి. తెలివితేటలు, విధేయత, కృషిల త్రివేణీ సంగమంగా మన జీవితం రూపొందాలి.

జాతి పునర్నిర్మాణాన్ని గురించి నేను చేసిన ప్రసంగాన్ని విని నా హృదయానికి దగ్గరైన నీవు ఆ పునర్నిర్మాణ యజ్ఞంలో పాలుపంచుకొనే వాడివిగా రూపొందగలవని విశ్వసిస్తున్నాను.

ఆశీస్సులు

................

## అవగాహన వైపు

విజయవాడ

చిరంజీవి............కి ఆశీస్సులతో వ్రాయునది 12-11-89

నీవు వ్రాసిన ఉత్తరం అందినది. మళ్ళీ నీవు పనిలోనికి దిగినందుకు సంతోషం. ఇకమీదనైనా అవాంతరాలు రాకుండా నీ జీవితం

కొనసాగగలదని ఆశిస్తున్నాను. చేస్తున్న పనిపైన అసహ్యం పుట్టడం అంత మంచిది కాదు. నీ విప్పటికి చాలాసార్లు ఆ పని నిలిపివేస్తూ వచ్చావు. మళ్ళీ ఆ పనినే ఆశ్రయించవలసిన పరిస్థితి ఎప్పటికప్పుడు నీకేర్పడుతూ వచ్చింది. నీవు అసహ్యించుకున్నా ఆ పని నీకు అన్నం పెడుతూనే ఉంది. ఇంతకూ నీవు దానిని వెగటుగా చూడవలసిన అవసరం ఎందుకు ఏర్పడు తున్నదో బోధపడటంలేదు. కారణం ఆ పనిలో లేదు. నీ మానసిక చాంచ ల్యమే దానికి కారణంగా కనబడుతున్నది. చంచల స్వభావం నుండి సరైన దారిన పడే మార్గాన్ని అవలంబించాల్సింది పోయి ఆ చాంచల్యానికి పెద్ద పీట వేసి కూర్చోబెట్టి మాటిమాటికీ పనిని మానివేస్తూ రావడం ఏమీ బాగుండలేదు. కనుక మనస్సును సరిచేసుకో! అప్పుడు అన్నీ సరిగా కనబడ తాయి. అసహ్యించుకోవలసిన అవసరం అప్పుడిక కలగదు.

ఇక నీవు ఇక్కడకు వచ్చినప్పుడు సంగతి. నీవు వచ్చి వరండాలో ఉన్నట్లు అక్కయ్యగారు నాతో చెప్పారు. నేను అత్యవసరమైన పనిలో ఉన్నాను. పని కాగానే నిన్ను గూర్చి అడిగాను. నీవు అక్కడ లేవనీ, వెళ్ళిపోయావనీ చెప్పారు. ఆ మాత్రం వేచి ఉండలేని స్థితిలో నీ మనస్సు ఉన్నది. దానిని గ్రహించలేక నీవు నన్ను తప్పు పట్టే ప్రయత్నం చేశావు. వచ్చిన వెంటనే లోపలకు పిలవవచ్చును కదా అని నీ భావన. ఒక పని జరుగుతున్నప్పుడు ఆ పనికి సంబంధించిన వారినే అక్కడకు అనుమతించవలసి ఉంటుంది. ఆ పనికి చెందని వారిని అనుమ తించడం క్రమశిక్షణా రాహిత్యాన్ని తెలియజేస్తుంది. మన అభిమానాలు, ఆత్మీయతలూ, ఆవేశాలూ, ఆపేక్షలూ, ఆ క్రమశిక్షణ అనే పట్టాలపైన నడుపుకోవడం మనం నేర్చుకోవలసి ఉంది. రైలు ఎంత గొప్పదైనా, ఎంత వేగంగా పోయేదైనా పట్టాలమీదనుండి పోవలసినదే! క్రమశిక్షణను అంగీకరించడం ఆరోగ్యకరమైన మనస్సుయొక్క లక్షణం. క్రమశిక్షణను ఉల్లంఘించాలని చూడటం మానసిక అనారోగ్యానికి నిదర్శనం. క్రమశిక్ష

ణను పాటించమన్నంత మాత్రాన ఎదుటి వారికి ఆపేక్షలు తక్కువ అను కొనే నీవంటివారు పెద్ద సంఖ్యలో కనబడుతూనే ఉంటారు. పద్ధతులు లేనిదీ, కోరనిదీ ప్రేమ అవుతుందనుకునేవారు కూడ తారసపడుతుంటారు.

ఆవేశాల స్థానంలో అవగాహన పెంపొందిననాడు క్రమశిక్షణ యొక్క ఆవశ్యకత బోధపడుతుంది. పది, పదిహేను సంవత్సరాలు నీలోని ఆవేశాలకు గాను ఖర్చు చేశావు. ఇకనైనా ఆవేశాలనుండి అవ గాహనకు నీ ప్రయాణం మళ్ళితే సంతోషిస్తాను.

...............

## మార్గదర్శకులు

విజయవాడ

ఆత్మీయులు...... .........గారికి ప్రేమతో వ్రాయునది.

మీరు వ్రాసిన లేఖ అందినది. సంతోషమైనది. ఇ.కె. మాస్టరుగారు మనకు మార్గదర్శకులు. వారు చెప్పినట్లు నడుచుకొనుట మన కర్తవ్యము. మిగిలిన వారు ఎట్లైన ప్రవర్తించవచ్చును. వారి అభిరుచులను ఎంచవలసిన పనిగాని, పట్టించుకోవలసిన పనిగాని మనకు లేదు. ఎవరి జీవ సంస్కా రాలను బట్టి, వారి అభిరుచులు ఏర్పడగలవు. అందుకు తగినవారే వారికి అనుయాయులుగా కూడ లభింపగలరు. కనుక వారి ప్రకారమే వారిని సాగ నిచ్చుట మంచి పని.

ఇక-సి.వి.వి మాస్టరుగారు 'గాయత్రి' పరమ మంత్రము అనియు, దానిని జపించుట మానపద్దనియు చెప్పియున్నారు. ఇ. కె. మాస్టరుగారుమనకు నేర్పినది కూడ అదియే కదా! తెలిసీ తెలియని వార్లు వేదములను గూర్చి

మాట్లాడుతున్నప్పుడు సి. వి. వి మాస్టరుగారు, 'వాటిని ప్రక్కన పెట్టి, నేను చెప్పేది వినండి. వేదముల పేరిట అనవసరమైన వాదములకు దిగవద్దు. వాటిని గురించి మీకు తెలిసింది చాల తక్కున. కాబట్టి వాటిని ప్రక్కనపెట్టి నేను చెప్పేది వినండి'—అన్నది వారి భావం. ఆ తరువాతి కాలంలో సి. వి. వి మాస్టరుగారు వేద, ఇతిహాస, పురాణాలను వివరించి చెప్పగలిగిన మహాద్రష్టగా ఇ. కె. మాస్టరుగారిని రూపొందించి, మానవ జాతికి ప్రసాదించినారు. ఈ సమన్వయము అంతుపట్టినవారు ధన్యులు. అంతుబట్టనివారు అనేక విధముల భావించుకొనుచు జన్మల తరబడి వేచి ఉండగలరు.

ఇ. కె. మాస్టరుగారిని కంటితో చూచి జంటగా నడిచిన మనము ధన్యులము. సూర్యోదయ సమయాన నిద్దురలో మునిగిన వానికి ఆ ఉషోదయ సౌందర్యం ఏ విధముగా అనుభవమునకు రాగలదు! సి.వి.వి మాస్టరుగారిని గూర్చి ఇ.కె. మాస్టరుగారికన్నా చెప్పగలిగిన వారు మరెవ్వరు? వేటూరివారు, మైనంపాటి వారల తరువాత ఆంధ్ర దేశమున ఆ వెలుగు ప్రసరించినది ఎక్కిరాల వారి ద్వారానే! ఎక్కిరాలవారు అంటే ఏమిటో తెలియాలీ అంటే ఎన్నో మెట్లు ఎక్కిరావలసి ఉంటుంది. ఎవరేమన్ననూ, ఏమి అనుకొన్ననూ సి. వి. వి. మాస్టరుగారు మాత్రము ఇ.కె గారి ద్వారా ప్రపంచ వ్యాప్తముగా ప్రసరించినారు. ఇ. కె. మాస్టరుగారు వర్తించిన కాలము సి. వి. వి. మాస్టరుగారి ఉద్యమంలో ఒక సువర్ణాధ్యాయము. సూర్యుని వెలుగును చూడలేనివారు ముఖమును చిట్లిస్తారు. కన్నులు మూసుకుంటారు. మనము ఏమి చేయగలము? వారిని కూడ ప్రేమించుచూ, మౌనముగా నుండుట ఒక్కటే మార్గము. మూగప్రేమ వలె మనమిప్పుడు మౌనప్రేమను అభ్యసింపవలయును. కాదనుచున్న వారిని కూడ మానసికముగా కౌగలించుకొనవలయును. ఇది మనకు

సాధన. ఇ. కె. మాస్టరుగారే చెప్పినట్లుగా ఇది మనకు వాసుదేవోపాసన. ప్రవర్తనలలో దైవమును చూడవలెనని ఇ. కె. మాస్టరుగారి ఉపదేశము. మనమల్లే సాగుదాము.

సి. వి. వి. గారి పూజా గదిలో త్రిమూర్తుల పటములుండేవి. ఆనాటి వారి పూజాగది యొక్క ఛాయాచిత్రాన్ని ఒకసారి మాస్టరుగారు నాకు చూపించారు. ఇ. కె. మాస్టరుగారు నవ్వుతూ నాతో ఇట్లనినారు. 'చూశావా ఈ చిత్రం ! ఇందులో సంప్రదాయ సిద్ధమైన దేవతా మూర్తుల చిత్రాలన్నీ ఉన్నాయి. ఎందుకనో తరువాత తరువాత పద్ధతి అంతా మారి పోయింది. మళ్ళీ ఇప్పుడు మనం అన్ని విధాలయిన చిత్రాలను పెడు తున్నాము. అన్నింటిలోనూ ఆ మాస్టరుగారినే చూస్తున్నాము' ఇవి ఆయన మాటలు. మనకు పరమ ప్రమాణములు. ఇ. కె. మాస్టరుగారు సమన్వయ మూర్తులు. సంస్కరణ ప్రియులు. మాస్టరు సంప్రదాయ ప్రవర్తకులు. నవ యుగ ప్రవక్తలు. వారి సన్నిధి మనకు పెన్నిధి. వారి సన్నిధిని అందించు నట్టి 'పెన్ను' ఇది.

ప్రేమతో

...............

# శాశ్వత గాధ

విజయవాడ

ప్రియ సోదరులు............గారికి ప్రేమతో వ్రాయునది 17-2-90

పరిణామంలో ఒక దశను దాటిన మానవునికి మామూలు దిన చర్య తృప్తిని ఇవ్వలేదు. మామూలు దినచర్య అంటే ఈ శరీరము ఉన్నది కాబట్టి దీనిని పోషించడము. ఆలుబిడ్డలు ఉన్నారు కాబట్టి వారిని

పోషించడము. బంధుమిత్రాదులు ఉన్నారు కాబట్టి వారియెడల మనకు గల బాధ్యతలను నెరవేర్చడం - ఇదీ మామూలు దినచర్య. పరిణామంలో ఒక దశను దాటిన మానవునికి ఇది మాత్రమే తృప్తిని ఈయజాలదు.ఎందుకని తృప్తి కలగటం లేదు? తృప్తి కలగాలీ అంటే నేనేం చేయాలి? అన్న ప్రశ్న అతడిలో కలుగుతుంది. ఆ ప్రశ్న కలిగి కలిగి మనస్సంతా తానై నిలుస్తుంది. అప్పుడు మానవుడికి దైవము గురు రూపములో సాక్షాత్కరిస్తాడు. అతణ్ణి అక్కున చేర్చుకుంటాడు. ఇలా చెబుతాడు: నీ ప్రశ్న నాకు వినబడింది. నీ ఆర్తి నన్ను స్పృశించింది. నీవు ఒక్క పని చేయి. శరీరాన్ని పోషించడంతో పాటుగా ఆ శరీరమనే ఆహార్యాన్ని (డ్రస్సు, మేకప్పు) ఈ ప్రకృతి నీ కెందుకు సమకూర్చిపెట్టిందో గమనించుకొని ఆ పాత్ర పోషణ చేయి. ఆ గమనించుకోవడం నేను నీకు నేర్పుకుంటాను. ఆలుబిడ్డలున్నారు. వారిని పోషించడంతో సరిపెట్టుకోకు. వారూ నీలాగా తమ తమ పాత్ర పోషణలకై దిగివచ్చినవారే! మీరందరూ కలసి నిర్వహించవలసిన కార్యక్రమం ఒకటి ఉన్నది కనుకనే ఒక కుటుంబంగా మీరు రూపొందింపబడ్డారు. దీనిని గమనించుకొని, కలసి ఆ కార్యక్రమాన్ని నిర్వహించండి. అందుకు కావలసిన శిక్షణ కూడ నేను ఇచ్చుకుంటాను. అలాగే బంధుమిత్రాదుల విషయం కూడా ఫలానావారే నీకు బంధు మిత్రులుగా ఎందుకుంటున్నారు? వారి పాత్రలకూ, నీ పాత్రకూ బలీయమైన సంబంధమేదో ఉన్నదన్న మాట. దానిని కూడ కలుపుకొని ముందుకు సాగు. ఆ కలుపుకోవడమెలాగో నేను నీకు నేర్పుకుంటాను. ఇలా నీవూ, నీ కుటుంబమూ, నీ బంధుమిత్రాదులు కలిసి పాత్ర పోషణ ప్రారంభించండి. అప్పుడు తృప్తి దొరుకుతుంది. అంటే తృప్తికి దారి దొరుకుతుంది. ఆ దారినే మన పెద్దలు 'మోక్షమార్గం' అన్నారు.

(5)

శరీరానికి కావలసింది భుక్తి. మనిషికి కావలసింది తృప్తి. ఈ రెంటినే మన పెద్దలు 'ఇహపరాలు' అన్నారు. భుక్తి వలన శరీరం నిలబడుతుంది. తృప్తివలన మానవుని జన్మకు ధన్యత లభిస్తుంది. అయితే ఈ రెంటినీ ఏక కాలంలో సాధించుకోవడం ఎలా? అని నీ వడగవచ్చు. ప్రతి మనిషికి తాను చేయగలిగిన, తానే చేయగలిగిన పని ఒకటి ఉంటుంది. ఆ పనిని 'నా కొరకు చేసుకుంటున్నాను.' అనుకున్నప్పుడు భుక్తి మాత్రమే లభిస్తుంది. ఆ పనినే దైవము కొరకు ఆయనకు తగినట్లుగా ఆచరించడం నేర్చినప్పుడు భుక్తీ, తృప్తీ రెండూ దొరుకుతాయి. 'తదర్థం కర్మ కౌంతేయ ముక్తస్సంగ సమాచర'-అన్న ఉపదేశ వాక్యానికి అర్థమిదే!

దైవానికి సమర్పణగా పనిని చేయడ మెప్పుడైతే ప్రారంభిస్తావో నీ శరీరం, ఇంద్రియాలూ, మనస్సూ, బుద్ధి-నానాటికీ మరింతగా చేతనవంతమవుతూ వుంటాయి. క్రమంగా తక్కువ కాలంలో ఎక్కువ పనిని అలసట లేకుండా హాయిగా చేయగలుగుతావు. ఎక్కువ పనినే కాదు. ఎక్కువ పనులను కూడా చేయగలుగుతావు.

నీ పాత్రత పెరుగుతూ ఉన్నకొద్దీ దైవము తన ప్రణాళికలో నీకు మరింత పాలు పంచిపెడతాడు. నిజానికి మనిషి చాలా పని చేయగలడు. కాని భుక్తికి సరిపడా మాత్రమే పని చేసుకునే స్థితిని అతడు అలవాటు చేసుకుంటున్నాడు. కావాలని తనని తానే తగ్గించుకుంటున్నాడు. తనలో తానే కుంచించుకొని పోతున్నాడు. మరి అప్పుడు, అతడు భుక్తికీ తన పనికీ ముడిపెట్టినప్పుడు ఇంక తృప్తి ఎక్కడ కలుగుతుంది. కనుక భుక్తికీ, పనికీ ముడిపెట్టకూడదు. దైవానికీ, పనికీ ముడిపెట్టాలి. కనెక్షన్ దేనికి దేనికి ఇవ్వాలో తెలియాలి. ఎటునుండి ఎటు ఇవ్వాలో తెలియాలి. ఈ తెలియడాన్ని గురించి చెబుతూనే 'యోగః కర్మసు కౌశలం' అన్నాడు శ్రీ కృష్ణుడు. కాబట్టి పనికీ, దైవానికీ కనెక్షన్ ఇస్తే భుక్తికోసం తడుము

కోవలసిన పని వుండదు. తృప్తికోసం దేవుళ్ళాడవలసిన అవసరమూ వుండదు. అప్పుడు దేవుడిలో వుండటం, దేవుడిలా వుండటమూ నీకు చేతనవుతుంది. దీనినే గీత 'అనన్య భక్తి' అంటున్నది.

పైన చెప్పబడిన దివ్యస్థితి నీకు అందవలెనంటే గురు రూపాన్ని ధరించి 'నేను' నిన్ను కొంతకాలము చేరదీయడం అవసరం. మానవరూపు డనై నేను నీతో మెలిగిన వేళ ఆ సాంగత్యమూ, ఆ సాహచర్యమూ, ఆ సాన్నిధ్యమూ నీకీ దివ్య స్థితిని అలవోకగా అందేటట్లుగా చూస్తాయి. కనుక కొంతకాలము గురుశిష్యులమై మనసు కలసి మెలగడం ఎంతైనా అవసరం. అందుకే నీలో ఆ తపన. అందుకో నా ఈ ఆహ్వానం.

ఇది ఒక శాశ్వత గాథ! నరనారాయణుల అనుబంధం ఇలా అనాదిగా నడచివస్తూ వున్నదే! నీ లేఖ చదివిన తరువాత నాలో మెదిలిన పదాలను నీతో ఇలా పలుకుతున్నాను. ఇది హృదయ భాష. మనస్సు ఘోషకు జవాబు చెప్పవలసింది హృదయ భాషయే! ప్రశాంతంగా సావధాన చిత్తులై ఈ లేఖను చదువుకోండి.

ప్రేమతో

..................

## మూడు విభాగాలు

విజయవాడ,

పూజ్యులు............... గారికి ప్రేమతో వ్రాయునది. 13-3-90.

మీరు వ్రాసిన ఉత్తరం అందినది. సంతోషమైనది. స్నేహమన్నది అన్నింటికీ అతీతమైనది. దానికి కులమతాలు, సంస్థలూ, వర్గాలూ అడ్డురావు. రాలేవు.

మాస్టరుగారు భౌతికదేహాన్ని విడిచిన తరువాత వారి కార్యక్రమము మూడు భాగాలయింది. మొదటిది సంస్థ. రెండవది వారి కుటుంబము. మూడవది వారి ఉద్యమము. ఈ మూడు విభాగములు నిలబడ వలసినవే! ముందుకు సాగవలసినవే! సోదరులు వారివారి సంస్కారములను బట్టి ఇందులోని ఏదో ఒక విభాగంతో శ్రుతి కలుపగలగడం సహజం. ఇందులో ఆశ్చర్యపడవలసిన పనిలేదు. మూడు విభాగములూ నిలబడ వలసినవే గనుక ఏ విభాగముతో శ్రుతి కలిపినా, అదిమాస్టరుగారు నిర్దేశించిన పనే అవుతుంది. కావలసినదల్లా ఒక విభాగముతో శ్రుతికలిపిన వారిని, మరొక విభాగంతో శ్రుతి కలిపినవారు వేరుగా చూడకుండా ఉండటం. ఈర్ష్యాద్వేషాలకు గురికాకుండా ఉండటం. ఒకరికొకరు పరాయి వారు కాకుండా ఉండ గలగటం! అంతే.

ప్రేమతో

................

## కాలగతులకు అనుగుణంగా

విజయవాడ

ప్రియ సోదరులు................ గారికి ప్రేమతో వ్రాయునది. 27-3-90

మీరు వ్రాసిన ఉత్తరము అందినది. వాతావరణము బోధపడింది. ప్రస్తుతం మనం ఉద్యమానికి పునాదులు వేయబడుతున్న దశలోఉన్నాం. ఈ పునాదుల గట్టిదనంతో క్రమంగా ఉద్యమం దేశవ్యాప్తమూ, ప్రపంచ వ్యాప్తమూ కాగలుగుతుంది. ఆ ఊరిలాంటి ప్రాంతాలనెన్నింటినో కార క్షేత్రాలుగా అది తీర్చి దిద్దుకుంటుంది.

ఒక మంచి భవిష్యత్తుకోసం తపస్సు ఇప్పుడు జరుగుతోంది. ఉద్యమం వివిధ ప్రాంతాల ప్రజలకు ఇచ్చిన మాటలన్నింటినీ నిలబెట్టు కుంటుంది. వారికి కావలసిన బాటలను తీర్చిపెడుతుంది. మనకిప్పుడు కావలసింది పరిపూర్ణమైన ఆత్మవిశ్వాసము. ఉద్యమ శీలికి కావలసిన మొదటి అర్హత ఇదే! రెండవది ఆత్మపరిశీలనము. ఇది ఉద్యమశీలిలో నిరంతరంగా జరుగుతూ ఉండవలసిందే! మూడవది ఆత్మార్పణము. మనకు నచ్చిన దైవ స్వరూపానికి మనని మనం అర్పణము చేసికోవడము ద్వారా అద్వైత స్థితిని అనుభవించగలగాలి– అప్పుడు మనకు కలిగేదే ఆత్మ సాక్షాత్కారం, ఆ సాక్షాత్కారం నిరంతరంగా కొనసాగుతూ ఉండగా ఉద్యమశీలిద్వారా ఉద్యమానికి రూపురేఖలు దిద్ద బడతాయి.

ఉద్యమానికి రూపకల్పన జరుగుతున్నవేళ ఉత్సాహము ఎంత అవసరమో, సంయమమూ అంత అవసరము. ఆవేశము ఎంత అవసరమో, అవగాహన అంత అవసరము. ఉన్ముఖత్వము ఎంత అవసరమో, ఉపేక్ష కూడా అంత అవసరము. అన్నింటినీమించి కాలగతులను గమనించు కొంటూ ఆ గతులకు అనుగుణంగా కార్యక్రమానికి రూపు దిద్దుకోవడం ఎంతైనా అవసరం.

ప్రస్తుతం మనఉద్యమము రాష్ట్ర ప్రజలకూ, దేశప్రజలకూ పరిచయ మవుతూ ఉన్నది. క్రమంగా రాష్ట్రం నుండీ, దేశంమొత్తం నుండీ కార్య కర్తలను సమీకరించు కుంటుంది. ఆపైన ఇప్పుడు ఒకటి రెండుచోట్లజరుగు తున్న కార్యక్రమాలను దేశ వ్యాప్తంగా నడిపిస్తుంది.

ప్రస్తుతం మనం ఉషః కాలంలో ఉన్నాము.

విశేషాలతో తరచు ఉత్తరాలు వ్రాస్తూఉండండి.

# ఈ ఉద్యమమే నా ఉద్యోగం

విజయవాడ,

పూజ్యులు ............. గారికి ప్రేమతో వ్రాయునది. 27-3-90

ఆత్మీయతతో మీరు వ్రాసిన లేఖ అందినది. అందులో మీరు వ్రాసిన అంశము లన్నియు ఒకటికి రెండుమారులు ఆలోచింప దగినవే!

మీరు వ్రాసిన అంశములలో ప్రధానమైనది. కొంతకాలమైనా నేను ఉద్యోగము చేసినచో బాగుండేది. అన్న అంశం. ఆర్థికపరమైన కోణము నుండి చూస్తే అదికొంత అవసరమేనని అనిపించవచ్చు. కాని మాస్టరుగారి ఉద్దేశానికి కట్టుబడిన నేను ఉద్యోగమన్న ప్రసక్తి ఈ జీవితంలో తీసికొని రాలేదు.

డాక్టరేట్ అయిపోయిన తరువాత ఒక రోజు మధ్యాహ్నం పూట మాష్టరు గారింట్లో భోజనాలు చేస్తున్నాం. వడ్డనచేస్తూ అక్కయ్యగారు అడిగారు నన్ను. పట్టాపుచ్చుకొన్నావు కదా! ఇక ఉద్యోగాని కెళతావా? అని. మాస్టరుగారు వెళ్లమంటే వెళ్లతాను! అన్నానేను. మాస్టరుగారు మా ఇద్దరి వైపుచూసి చిరునవ్వు నవ్వి ఊరుకున్నారు.

ఆ తరువాత కొన్ని రోజులకు అప్పటి ఆంధ్రా యూనివర్సిటీ రిజిష్ట్రార్ గోపాల కృష్ణారెడ్డిగారు మాస్టరుగారితో మాట్లాడుతూ, 'మాస్టరు గారూ! కృష్ణస్వామిని మాకుఇచ్చేయ వచ్చుకదా!' అని అడిగారు. అప్పుడు మాస్టరుగారు ఇలా అన్నారు: మీ కోరిక బాగానే ఉన్నది. కాని కృష్ణస్వామిని మీరెలా సద్వినియోగం చేయగలరు? అతన్ని పూర్తిగా సద్వినియోగం చేయటానికి యూనివర్సిటీలో ప్రస్తుతం ఉన్నఏ డిపార్ట్ మెంటులోనూ అవకాశం కుదరదు. అతన్ని సద్వినియోగం చేయాలీ అంటే భారతీయ సంస్కృతిని గూర్చి మీరు ప్రత్యేకంగా ఒక డిపార్టుమెంటును

రూపొందించగలగాలి. అలా రూపొందించ గలిగితే కృష్ణస్వామి అందులో కొంతకాలంపాటు పనిచేస్తాడు. తన తరువాతి తరాన్ని రూపుదిద్ది, వారికి ఆ డిపార్టుమెంట్‌ను అప్పజెప్పి తాను ఇవతలకు వచ్చేస్తాడు. చూడండి, మరి అలా ఏమన్నా చేయగలరేమో!' అన్నారు.

గోపాల కృష్ణారెడ్డిగారు చాలా సంతోషించారు. మాస్టరుగారు ఇచ్చిన ఆ సంకల్పానికి తప్పక ప్రయత్నం చేస్తామన్నారు.ఇది 1980నాటి మాట. ఆ తరువాత కొన్నేళ్లు గడిచాయి. భారత ప్రభుత్వం 'భారతీయ సంస్కృతి-వారసత్వం, అనే సబ్జెక్టును దేశవ్యాప్తంగాడిగ్రీ విద్యార్థులందరికీ పెట్టింది. అయితే యూనివర్శిటీలలో దీనికి సంబంధించిన ప్రత్యేకమైన శాఖను మాత్రం ఇంకా నెలకొల్పలేదు. ఏది ఏమైనా భారతీయ సంస్కృతి—వారసత్వాలపై ఒక ప్రత్యేకమైన కృషి నానుండి జరగాలీ అన్నది మాస్టరుగారి సంకల్పమని గ్రహించడానికి ఆ సన్నివేశం పనికి వచ్చింది.

ఇలాంటి సన్నివేశాలు నడవడం వలన ఇక నాకు ఉద్యోగం చేయాలని అనిపించలేదు. ఎవరైనా అడిగితే 'ఈ ఉద్యమమే నా ఉద్యోగం' అనిచెప్పడం నాకు అలవాటైపోయింది. అయితే, రీసర్చ్ చేస్తున్న రోజులలోగాని, రీసెర్చ్ పూర్తయి మాస్టరుగారి కార్యక్రమంలోపూర్తిగా నిమగ్నమైన తరువాతగానె, వారు భౌతికదేహాన్ని త్యజించిన తరువాత, ఇలా మానవ ధర్మ శిక్షణ సంస్థ వేదికపైన నిలబడినప్పుడుగానీ, ఏనాడూ నాకు ఏలోటూ అనిపించలేదు. కనిపించలేదు. అదే మాస్టరుగారి అనుగ్రహం అనుకున్నాను. ఉద్యోగంచేయడం తప్పన్న ఉద్దేశం మాస్టరు గారికీ లేదు. నాకూలేదు. అయితే ఈ నా జీవితంతో ఆయన ఒక ప్రత్యేకమైన ప్రయోగాన్ని చేయగోరి ఇలా ఉద్యోగాల్లాంటి వాటికి అతీతంగా నన్ను అట్టిపెట్టుకున్నారని మాత్రం నాకు తెలుసును.

మాస్టరుగారి ద్వారా నడిచిన ఉద్యమము 'పార్టు-టైమర్స్'ను ప్రధానంగా తీసికొని నడిచింది, ఇప్పుడు మానవధర్మ శిక్షణ సంస్థద్వారా

వ్యక్తమవుతున్న ఉద్యమంలో పార్టుటైమర్సుతో పాటుగా ఫుల్‌టైమర్సును కూడా తీర్చి దిద్దవలసిన ఆవశ్యకత గమనించ బడింది. తగుమాత్రంగా ఫుల్ టైమర్స్ ఉండటం కూడా ఉద్యమానికి అవసరమేనని అనుభవం చెబుతున్నది. అందువల్ల మొదటి ఫుల్ టైమర్‌గా నన్ను నేను రూపుదిద్దు కోవడం ప్రస్తుతం జరుగుతూ ఉన్నది. మాస్టరుగారి ఉద్యమం తీసుకుంటున్న ఈ మలుపును గూర్చి ముందు ముందు మనకు మరిన్ని అంశాలు స్పష్టము కాగలవు. ప్రేమతో కూడిన బాధ్యతతో మీరు వ్రాసిన లేఖ మరల ఇలా ప్రయాణాన్ని సమీక్షించు కోవడానికి పనికి వచ్చింది.

షోడశ సంస్కారాలను గురించి కావలసిన అంశాలు సమీకరింప బడుతూ ఉన్నాయి. ఆ సమీకరణ పూర్తికాగానే గ్రంథరచన ప్రారంభం కాగలదు.

మీరు మరల ఇటువైపు ఎప్పుడు వస్తున్నారు.

సం॥...............

# చిక్కడమేమిటి!

విజయవాడ

రసహృదయులు. రాజు గారికి ప్రేమతో వ్రాయునది. 12-4-90

మీ ఆరోగ్యమెలా ఉంది? మీరు కొంచెం చిక్కినట్లుగానూ, నిస్సత్తువుగా ఉన్నట్లుగానూ అక్కడనుండి వచ్చిన సోదరులొకరు చెప్పారు. నాకుఆశ్చర్యం వేసింది. సింహం చిక్కడ మేమిటి! అని. కొందరి కొందరి విషయాల్లో కొన్ని కొన్ని ఊహించలేము. మీరు స్వస్థతతో వేదికలపై మునుపటివలె ఎక్కువగా కనబడుతూ, వేలాది ప్రజలకు ముచ్చట కలిగించాలనీ వారి మనస్సులకు ఉన్న ముడులను అలావిప్పుతూనే ఉండాలనీ మనసారా కోరుతూ ఉన్నాను.

యోగక్షేమాలతో ఉత్తరాలు వ్రాస్తూ ఉండండి.

సం॥...............

## పదికాలాలపాటు

విజయవాడ

సహృదయులు.............. గారికి ప్రేమతో వ్రాయునది 12-4-90

రాజకీయాల్లో విలువలన్నవే లేకుండా పోతున్న ఈ రోజుల్లో తామరాకుపై నీటిబొట్టులా మీరు ప్రకాశించ గలగటం చాలా ఆనందకర మైన అంశం. చాలామంది రాజకీయాల్లో చేరి వ్యక్తిత్వాన్ని కోల్పోతున్న ఈ రోజుల్లో మీరు అ రాజకియాల్లో ఉండే ఇంతటి ఔన్నత్యాన్ని వ్యక్తం చేయటమన్నది చాలా తృప్తిని కలిగించిన అంశం. ప్రజాసేవలో పది కాలాలపాటు వర్థిల్లండి.

ప్రేమతో

...............

## ఆశీస్సులు

విజయవాడ

చిరంజీవికి ఆశీస్సులు 12-4-90

నీ పరిస్థితులు ఎప్పటికప్పుడు తెలుస్తూనే ఉన్నాయి. కాలపు తాకిడికి తట్టుకొనలేక నీవు ఎంతగా విలవిలలాడి పోయావో కూడా నా హృదయానికి తెలియవచ్చింది. చిన్నతనంలోనే సాధకుడిపై రాటుదేలుతున్న నీకు జీవి తంలో ఇలాంటి ఆటుపోటులు సంభవించడం విధిలీలగా ఉన్నది.

విధి ఇంతగా విరుచుకు పడినప్పటికీ క్రమంగా నిన్ను నీవే కూడదీసుకొని, నీతో ఉన్నవారిని కూడా తీసికొని సాధనలో ముందుకు సాగే ప్రయత్నంలో ఉన్న నీకు పరమ గురువుల ఆశీస్సులు ఎప్పుడూ ఉంటాయి.

పదిమందికి పనికి వచ్చే పనిని అంకితభావంతో చేస్తున్న నీకు నా ఆశీస్సులు.

ఆశీస్సులు

..............

## అమ్మవారి కథ

విజయవాడ

శ్రీమతి............కు ప్రేమతో

30-4-90

ట్రెయిన్ హాయిగా అందింది. బెర్త్ వెంటనే కనబడింది. సుఖంగా కోర్చోగానే మల్లెపూల దండ మెడలో పడింది. చూతును కదా! 28 రాత్రి అక్కడ మనను కలిసిన పూజారిగారు. చేతిలో అమ్మవారి ప్రసాదమైన మామిడిపండు ఉంచి పాదాలకు నమస్కరిస్తున్నారు. చాల ఆనందం కలిగింది. ఇదేదో మొత్తం అమ్మవారి కథగా అనిపించింది. చూస్తుం అలాగే కనిపిస్తోంది. ఏమంటావు!

ఈసారి వచ్చినప్పుడు గుడికి వస్తాను అన్నాను. గుండె సంతోషంతో పొంగిపోయింది ఆయనకు. గుడిప్రక్కనే కమ్యూనిటీ హా కూడా ఉంది స్వామీ! మనం మన సమావేశాలు అందులో కూడా జరుకోవచ్చు- అన్నారాయన. అలాగే జరుపుకుందామని సంతోషంగా చెప్పా నేను. ఆయన ముఖం వెలిగిపోయింది. బాగుందా అమ్మవారి కథ !

ప్రేమ:

.............

# ఎద ఎదలో

ఆత్మీయులు............గారికి ప్రేమతో వ్రాయునది 30-4-90

ట్రయిన్ అందడం దగ్గరనుండి ఇక్కడకు చేరేవరకు ప్రయాణం క్షేమంగా సాగింది. ట్రయిన్ దగ్గరకు మన అమ్మవారి గుడి పూజారిగారు వచ్చి మళ్ళీ దండ వేసి, అమ్మవారి ప్రసాదాన్ని అందించారు. చాలా తృప్తి కలిగింది. అమ్మవారి అనుగ్రహంతో త్వరలోనే మనం అందుకున్న కార్యక్రమాన్ని మనం భూమిపైన చూడగలుగుతాము.

గండిపేట దగ్గర వాతావరణం గుర్తుకొచ్చింది. మండు టెండలో మంచి వాన కురిపించారు మాస్టరుగారు. మనను అన్నివిధాలా చల్లబరిచారు. ఆయన సందేశాన్ని వెదజల్లే అవకాశం మనకు అనుగ్రహించారు. ఇక వెదజల్లుదాం. ఎద ఎదలో చల్లుదాం.

ప్రేమతో

...............

# మననం చేసికొంటూ

విజయవాడ

ఆత్మీయులకు ఆశీస్సులతో వ్రాయునది. 27-7-90

అతనినుండి ఉత్తరాలు లేవు. పైకి చూస్తుంటే ఇంతలోనే చల్లబడిపోయినట్లు అనిపిస్తుంది. ఎంతసేపూ స్టిమ్యులేషన్ (Stimulation) కావాలంటే ఎలా ? గురువుచేత తోయబడో, తోమబడో నడిచేవాళ్ళు కాదిప్పుడు కావలసింది. గురుమూర్తిని ఆదర్శంగా తీసుకొని, ఉత్సాహంగా తమకు తాముగా ఆత్మ సాధనకై ముందుకు సాగేవారు కావాలి. మనవాళ్లో

కొంచెం లేవగొట్టండి. మీరెలాగూ రోజూ చేస్తున్న పని అదే! ఇప్పుడు నా తరఫున కూడా మీరే చేయండి. అక్కడ మనం అనుకొన్న పన అనుకొన్నట్లుగా జరిగేట్లు చూడండి. లక్ష్యసాధన విషయంలో (Readyness) రెడీనెస్ అండ్ స్టెడీనెస్ (Steadyness) మనలో రావలసి ఉన్నదని కదా మనం చెప్పుకున్నది! ఆ వాక్యాలు మరల మరల మనం మననం చేసికొంటూ ఉండాలి.

అందరినీ అడిగినట్లు చెప్పండి.

ప్రేమ

...............

# ఒక ముచ్చట-ఒక మురిపెం

విజయవ

ఆత్మీయులు........గారికి ప్రేమతో వ్రాయునది. 27-7-

ఇక్కడ శిక్షణ తరగతులు ఉత్తేజకరంగా నడుస్తున్నాయి. వే శిక్షణ నడుస్తున్నది. ఇప్పుడు వైద్య శిక్షణ ప్రారంభం కాబోతున్న వట్టణమంతా శిక్షణ తరగతుల వాతావరణం కనబడుతున్నది. ఇది ప్ర లంతా కలసి, ఉత్సాహంగా జరుపుకునే పెద్ద పండుగలాగ ఉన్న కార్యకర్తలు ఉత్సాహంతో ఉరకలు వేస్తున్నారు. 'ఆకాశమే మాకు హద్ద అంటున్నారు. ఈ అవకాశం వారికంతటి ప్రేరణను అందిస్తున్నది. మాస్ట గారు ఇప్పుడు తమ విశ్వరూపాన్ని వ్యక్తం చేస్తున్నారు. ఇది ఒ ముచ్చట ఇది ఒక మురిపెం. ఇది ఒక ఆశ్చర్యం. ఇది ఒక అద్భుతం ఇది ఒక అనుభూతి, మనందరం మరువలేని మహానుభూతి.

అందరికీ మానవారంవరికి ఈ అనుభూతిని అందించండి.

ప్రేమతో

................

## నాకన్నా వేరుగా

విజయవాడ

ఆత్మీయులు..............గారికి ప్రేమతో వ్రాయునది. 27-7-90

అక్కడ మన కార్యక్రమం నిండుగా జరిగింది. కన్నులకు పండుగగా, మనస్సుకు తృప్తిగా హాయిగా జరిగి పోయింది. అది చాలా కాలంతరువాత జరిగి ఉండవచ్చు. కాని జరిగిన కాలమంతటినీ మరపించే టంత అనుభూతి మొన్నటి ఆ కార్యక్రమం ఇచ్చింది. మన చోటుకు మనం చేరగలిగాం. మన చోటులో మనం మళ్లీ దీపారాధన చేయగలిగాం. మన వాళ్లందరినీ మనం కలుసుకోగలిగాం. మనవాళ్లందరితో మనం కలసిగడప గలిగాం. వారి యోగక్షేమాలు స్వయంగా కనుక్కోగలిగాం. వారికి కావలసిన సేవను ప్రేమతో అందించ గలిగాం అని నాకు ఎంతగానో ఆనందమైంది.

నా ఆపేక్షలకు లోతులెక్కువ. నా మమకారలకు హద్దు లెక్కడో! నాకు దగ్గరైన వారంటే నాకెంత ఇష్టమంటే నాకన్నా వారిని వేరుగా చూడ లేను. ఈ లక్షణంనాలో చిన్నప్పటినుండీ ఉంది. మాస్టరుగారి సాహచర్యంతో అది మరింత గుబాళించింది. నా వారు అనుకున్న వారి యెడల బాధ్యత పడేస్వభావంనాది. వారు అన్ని విధాలా ఎదిగిరావాలని నామనస్సు కోరుతుంది. అందుకు తగిన శిక్షణ కూడా ఇస్తూ ఉంటుంది వారికి. ఒకొక్కప్పుడు ఆ శిక్షణ పొందుతున్న వారికి ఇబ్బందిగా కూడా అనిపిస్తుంది. ఈయనతో తట్టుకోవడం కష్టమనిపిస్తుంది. ఈయన లేకుండా తట్టుకోవడం కూడా ఇంకా కష్టమేనని వారి మనస్సు వారికి చెబుతుంది. ఎందుకని అంటే అది నా ప్రేమను అంతగా రుచి చూసి ఉంటుంది గనుక. కనుకనే

నాకెవ్వరూ దూరంకాలేరు. తాత్కాలికంగా భౌతికంగా దూరమైనట్లు కనబడినా వారు నా స్మరణలోనే ఉంటారు. నన్ను మరచి పోలేరు. నా ప్రేమకున్న శక్తి అంతటిది. అది నాకు తెలుసు.

అలాంటి ప్రేమలో ఇన్నేళ్లుగా ఓలలాడుతున్న సోదర బృందం అక్కడ ఒక్కసారిగా నాచుట్టూ చేరడం, ఆదమరచి ఆత్మీయతతో వర్తించడం నాకెంతో హాయిని కలిగించింది. ఇన్నేళ్లుగా కాలపు తాకిడికి తట్టుకొని నిలబడిన ఈ ప్రేమా ఈ బృందం ఇక నవశకానికి శ్రీకారం చుట్టవలసిన శుభసమయం ఆసన్నమవుతున్నది. నడుస్తున్న సన్నివేశాలు ఆ శుభఘడియలనే తలపిస్తున్నాయి.

అందరినీ మన వారందరినీ అడిగినట్లు చెప్పండి.

ప్రేమతో

...............

## జె. పి. గురించి

విజయవాడ

ఆత్మీయులు............ గారికి ప్రేమతో వ్రాయునది. 7-10-90

జయప్రకాశ్ గురించి నేను వేరే చెప్పాలా! ఆయనకు ఎంతగా ఋణపడి ఉన్నాం మనం! ఆ ఋణం తీరేదా! తన ధర్మచక్రాన్ని అడ్డువేసి నియంతృత్వం లోనికి వెళ్లిపోతున్న భారతదేశాన్ని రక్షించిన వాడాయన! ప్రజాస్వామ్యంలో బలమైన ప్రతిపక్షం లేకపోతే నియంతృత్వం తప్పదని హెచ్చరించి బలమైన ప్రతిపక్షానికి రూపురేఖలుదిద్దే ప్రయత్నం చేసిన వాడాయన. ఈ విషయంలో ఆయనది వజ్ర సంకల్పం. అది ఇప్పటికీ

పని చేస్తూనే ఉంది. భారతదేశంలో రెండు పార్టీల వ్యవస్థ దృఢంగా ఏర్పడేవరకు, ఆ సంకల్పం పనిచేస్తూనే ఉంటుంది. దేశానికి స్వాతంత్ర్యం తెచ్చిన వాడు గాంధీమహాత్ముడైతే, స్వాతంత్ర్యం పొందిన ఈ దేశం నియంతృత్వం లోనికి వెళ్లిపోకుండా రక్షించిన వాడు జయప్రకాశ్ నారాయణ్. అందుకే అన్నాను— 'ఆయన ఋణం ఈ జాతి తీర్చుకోలేదూ' అని.

ప్రేమతో

..................

## ఒక్క మాట

విజయవాడ

పూజ్యులు శ్రీ...............వారికి నమస్సులతో వ్రాయునది. 15-1-91

మీరు వ్రాసిన లేఖ సూటిగా ఉన్నది- మీ ఋజుత్వమును చాటు తున్నది. గురుదేవుల యెడ మీకుగల గాఢానురక్తికి ఒక సంకేతంగా ఉన్నదీ. మా కందరకూ సంతోషమైనది. నేను మీ భాషనే కాక మీ హృదయ భాషనుకూడ వినగలను. అదిచేసే ఘోషను కూడ గమనించుకోగలను. అందు వలననే మీ సమర్పణ శీలానికి చేతులెత్తి నమస్కరిస్తున్నాను.

ఒక్కమాట! మీగురుదేవుల మాటమీకు బాట! మాగురుదేవులమాట మాకు బాట! మా గురుదేవుల మాటను మేము కాదన్ననాడు మేము నిజంగా అతి చరించిన వారమే! ఆ మాట ప్రకారం నడుచుకొన్నంత కాలము తృప్తిగా సాగిపోవలసిన వారమే! మాకు మాస్టరు CVV దర్శనము కూడా వారిద్వారా లభించినదే! వారి వలన లభించినదే! వారిలో లభించినదే! మా అనుభవంలో మా గురుదేవులు మాస్టరు సి.వి.వి. కన్నా భిన్నంకారు. వారు

చెప్పినదే మాకు ప్రమాణము! వారి మాటకు కట్టుబడి మేము నడుస్తున్నామన్నది మాత్రం ఎవ్వరూ కాదనలేని అంశం. వారి మాటలకు భిన్నంగా నడిచిన రోజున ఎవరైనా మమ్మల్ని వేలెత్తి చూపించవచ్చు. ఎవరి ఉద్యమ ఫలితం ఎంతటిదీ అన్నది కాలమే నిర్ణయించగలదు.

నమస్సులు

...............

## సమాధానం - సంగమం

విజయవా

ప్రియ సోదరునకు, 20-3-9

మీరు పంపిన ఆహ్వాన పత్రిక అందింది. మాస్టరుగారి సాన్నిధ్యమును పొందుటకై మీరు చేయుచున్న ప్రయత్నము ఫలవంతముకావలెనని కోరుచున్నాను. ఎవరిని ఏ రీతిగా సముదాయించవలెనో, సమాధానపరచవలెనో, తీర్చిదిద్ది నిలుపవలయునో మాస్టరుగారికి బాగుగా తెలియును. సకల ప్రయత్నములు, సర్వాంతర్యామి అయిన మాస్టరుగారి యందు సంగమము చెందగలవు.

ప్రేమతో

...................

## ఆ ఊరు ఆ ప్రజలు

విజయవాడ

చిరంజీవి............కు ఆశీస్సులతో వ్రాయునది. 21-5-91

ఆ ఊరు, ఆ ప్రజలు నేనంటే ఎంతో ఇష్టపడతారు. అక్కడ తిరుగాడుతూ ఉన్నప్పుడు ఈ బంధం ఈ నాటిదీ కాదు అనిపిస్తుంది.

ఏది ఏమైనా ఆ గ్రామాన్ని ఒక మూలబిందువుగా స్వీకరించి, ఆ ప్రాంతంలో ప్రజలకు కావలసిన నిజమయిన కార్యక్రమాలు చేపట్టవలసి ఉన్నది. మనకు తోచిందికాదు. ప్రజలు కోరింది కాదు. అక్కడి ప్రజలకు నిజంగా ఏం కావాలో అది జరగాలి. ఇవాళ సమాజంలో ఎక్కువచోట్ల కనబడుతున్నదిదే! ఈ ఇబ్బందే! పెద్దలు అనబడేవారు తమకు తోచిందయినా చేస్తున్నారు. ప్రజలు కోరిందయినా చేస్తున్నారు. ఇంతకూ ఇక్కడి ప్రజలకు నిజంగా కావలసింది ఏమిటి అని ఆలోచించ గలవారు తక్కువ సంఖ్యలో కనబడుతున్నారు. అక్కడిదాకా, ఆ ఆలోచనదాకా, ఆ అవసరం దాకా మనం వెళ్లాలి. అలాంటి ప్రాంతాలు గుర్తుకు వచ్చినప్పుడు నాలో మెదిలే భావ పరంపరలు ఇలాఉంటాయి. ఈ భావ పరంపరనుండే నీకు కావలసిన సందేశం కూడా అందగలదని అనుకొంటున్నాను.

తరచు ఉత్తరాలు వ్రాస్తూ ఉండు. విజయవాడ వచ్చినప్పుడు మన కార్యాలయానికి తప్పకుండారా!

ఆశీస్సులతో

.....................

# ప్రేయరే మూలం

విజయవాడ

ఆత్మీయుడు............కు ప్రేమతో వ్రాయునది. 15-6-91

సకల కార్యక్రమాలకూ ప్రేయరే మూలం. ప్రేయరే ఆధారం ప్రేయరే సాధనం. ప్రేయరును మనం శ్రద్ధగా నిర్వహిస్తూ ఉంటే కావలసిన కార్యక్రమాలు ఆ ప్రేయరు నుండి వాటికవిగా రూపుకట్టుకుంటాయి.

నిజానికి విజయవాడలో జరిగినది అదే! ప్రారంభదశలో విజయవాడలో ఉన్న కొద్దిమంది కార్యకర్తలకు సరిగా ఇలాగే చెప్పాను! 'మీరు ప్రేయరును శ్రద్ధగా చేయండి. మిగిలిన వాటి నన్నింటినీ ఆ ప్రేయరే మనకు ఒనగూర్చి పెడుతుంది. ప్రేయరు వలన మాస్టరుగారి కృప, అవకాశాల రూపంలో నడచి వస్తుంది. ఆ అవకాశాలను శ్రద్ధతో మనం సద్వినియోగం చేస్తున్న కొద్దీ జాతి మొత్తానికి పనికి వచ్చే కార్యక్రమాలు మనకు తెలియకుండానే మనచుట్టూ రూపుదిద్దు కుంటాయి. మాస్టరుగారి వైభవాన్ని దినచర్య రూపంలో అప్పుడు మనం అనుభవించగలుగుతాం— అని. ఇప్పుడు విజయవాడలో జరుగుతున్నది సరిగా ఇదే! అక్కడకూడ జరుగవలసినది ఇదే!

ఎల్లరకు శుభాకాంక్షలతో

........................

## తపన తపస్సు కావాలి

విజయవాడ

ఆత్మీయులు................గారికి ప్రేమతో వ్రాయునది 30-6-91

బాగున్నారా! ఉద్యోగ విరమణ తరువాత ఒక నూతన మయిన దిన చర్యను రూపొందించుకొని ఉంటారు. ఆ దినచర్య అన్ని విధాలా మీకు తృప్తిని కలిగిస్తూ ఉన్నది కదా!

మీరు చురుకయినవారు. ఎప్పుడూ వేగవంతమయిన కార్యక్రమా లలో నిరంతరం కృషి చేసే స్వభావం మీది. ఇప్పుడా వేగాన్ని యేయే కోణాలలో మళ్ళిస్తున్నారు? ఏయే కార్యక్షేత్రాలను పండిస్తున్నారు?

కుటుంబ క్షేమంతో సరిపెట్టుకునే మనస్సు కాదు మీది. సమాజ క్షేమంకోసం అది తపన పడుతూ ఉంటుంది. మీ తపన తపస్సు కావాలి. మీ జీవితం సార్థకం కావాలి.

చుట్టూ వున్న నలుగురితో సరిపెట్టుకునే తత్త్వంకాదు మీది. దూర ప్రాంతాలకయినా, సజ్జన సాంగత్యాన్నై- సాహసోపేతంగా సాగిపోగల తత్త్వం మీది. మీ సాహసం సఫలం కావాలి! మీ స్నేహశీలం మిమ్మల్ని అందరివాడుగా రూపొందించాలి.

మన సంస్థ కార్యక్రమాలు విస్తృత పరిధిలో విజయవంతంగా సాగిపోతున్నాయి. విజయవాడనుండి మనం రూపుదిద్దుతున్న ప్రణాళికకు వాడవాడలా విజయమే లభిస్తున్నది. మీవంటి సహృదయుల శుభాకాంక్షలే నడుస్తున్న ఈ ఉద్యమానికి నిజమయిన పెట్టుబడి.

ప్రేమతో

................

# లక్ష పనులు

విజయవాడ

చి॥సౌ॥............కు ఆశీస్సులతో వ్రాయునది 18-7-91

పనులు లక్ష ఉండవచ్చు. ఏది ముందు, ఏదీ వెనుక అన్నది తెలియాలి. ఏది ఎప్పుడు యెలా చేస్తే బాగుంటుందనేది బోధపడుతూ ఉండాలి. ఏదో పనిలో ఉండటం కాదు. ఏ పనిలో ఉండాలో ఆ పనిలో ఉండాలి. ఈ విషయంలో మనని మనం సమర్థించుకోకూడదు. పెద్దవారి యెడల సమర్పణ భావం కలిగి, వారికి తగినట్లుగా మెలగాలి. అలా మెల్ల

గటం కోసం తపించాలి. ప్రయత్నించడం చాలదు. పరితపించడం కావాలి. సంసిద్ధత చాలదు. సమర్పణ కూడా కావాలి. అభిమానం చాలదు. ఆ అభిమానం ఆచరణగా రూపొందాలి. భక్తి చాలదు. శ్రద్ధ కావాలి. ఆవేశం చాలదు. అంకిత భావం కావాలి. సహృదయం చాలదు. అది సత్కర్మాచరణకు ఉన్ముఖం కావాలి.

ప్రేయరు చేయడం ప్రారంభించాను-అని వ్రాశావు. ఉదయము, సాయంత్రమూ శ్రద్ధగా ప్రేయరు చేయి. అప్పుడు పైన చెప్పిన లక్షణాలన్నీ క్రమంగా అలవోకగా నీనుండి వ్యక్తమవుతాయి. ఎవరో ఏదో అనుకుంటారని ప్రేయరు బయటకు చేయడం మాని, గొణుగుకోనక్కరలేదు. ఏమనుకుంటారు! ప్రేయరు చేస్తున్నారు అనుకుంటారు. ఇష్టమయితే మెచ్చుకుంటారు. కష్టమయితే వెక్కపడతారు. వారేది చేసినా ఆ క్షణంలో వారూ మాస్టరుగారిని స్మరించినవారే అవుతున్నారు. ఒక్కమాట! ప్రేయరును మించిన ఔషధం లేదు. ప్రేయరుతో కుదుటపడని వ్యాధి లేదు. అటువంటి ప్రేయరు నీతో ఉండగా నీవు కెంపేలు పడవలసిన పని లేదు. గురి కుదిరితే గురువు నీవాడే !

ఆశీస్సులు

................

## అందరమూ పాత్రధారులమే

విజయవాడ

యోగ మిత్రులు............గారికి ప్రేమతో వ్రాయునది 18-7-91

మాస్టరుగారి కార్యక్రమం ఏ ఒక్కరితోనూ జరిగేది కాదు. ఆయన చేత స్వీకరింపబడిన వారు అందరూ ఆ కార్యక్రమ నిర్వహణలో పాత్ర

ధారులే! వ్యక్తిగత ప్రార్థన అన్న స్థితినుండి సామూహిక ప్రార్థన అన్న స్థితికి సాధకులను ఆయన ఎలా మళ్ళించారో, వ్యక్తిగత కృషి అన్న స్థితినుండి సమష్టి కృషి అన్న స్థితికికూడా అలాగే సాధకులను మళ్ళించారాయన. కనుక ఆయన కథలో అందరమూ పాత్రధారులమే.

మీ గొంతులో ఎందుకనో విషాదం జీరసాగుతోంది. మీ మాటలో ఎందువల్లనో నిరాశ కనబడుతోంది. కావలసిన పని చాలా ఉండవచ్చు. కాని దానిని విషాదమూ నిరాశలతో సాధించగలమా అన్నది ప్రశ్న.

మాస్టరుగారి మార్గంలో ఉత్సాహం కొద్దీ ఉపన్యాసాలు చెబుతున్న వారెలా వున్నారో, తమ తమ జీవితాలను మాస్టరుగారి పాదాల చెంత సమర్పణ చేసికొని సేవా భావంతో త్యాగమూర్తులయి దీపకళికలుగా వెలుగొందుతున్నవారూ అలాగే ఉన్నారు. ఇంకా చెప్పాలీ అంటే లెక్కకు మిక్కిలిగా ఉన్నారు. వారిలో ఎవరిని దర్శించినా చాలు, ఎవరిని స్మరించినా చాలు మాస్టరుగారు మనకు ఇట్టే అనుభవానికొస్తారు.

అయితే సాధకులయిన వారిలో అందరూ అన్ని కోణాలలో పనిచేస్తూ ఉండకపోవచ్చు. కొందరు కొన్ని కోణాలకే పరిమితమై ఉండవచ్చు. మనకు అవసరం అనిపిస్తున్న కోణంలో వారినుండి పని జరుగుతూ ఉండకపోవచ్చు. అంతమాత్రంచేత వారినుండి అసలు పనే జరగటంలేదనీ, మాస్టరుగారి మార్గము నీరసపడి పోయిందనీ అనవచ్చునా!

ఇక్కడ ఒక చిత్రమున్నది. ఎవరినుండి ఏ కోణంలో పని జరగాలో వారికి ఆ కోణం కనబడుతూ ఉంటుంది. 'ఆ కోణంలో మిగతావారు చేయడంలేదు అని ఆక్షేపించడం కన్నా, ఆ కోణంలో మనము చేయవలసింది వున్నది' అని మాస్టరుగారు మనకు తెలియచెబుతున్నారు. అది గ్రహించటం అవసరం,

తోటి వారిని నిరసిస్తూ మనం ముందుకు సాగలేం. తోటివాళ్ని ప్రోత్సహిస్తూ, విశేషమయినచోట్ల అభినందిస్తూ మనం ముందుకు సాగగలం. మాస్టరుగారు మీనుండి ఉద్దేశించిన కార్యక్రమాన్ని వ్యక్తం చేస్తున్న వేళ ఆ వైభవాన్ని కనులారా చూడాలని మనసారా కోరుతూ

ప్రేమతో

................

# తపస్సుకు ఫలితాలు

విజయవాడ

యోగమిత్రులు...........గారికి ప్రేమతో వ్రాయునది 28-7.

భృక్తాన్ని గూర్చి వ్రాశారు మీరు. అనేక కోణాలనుంచి మారుగా చూడవలసిన అంశమది! మీరు చదివిన నా వివరణ ఒకానొక కోణంనుండి ఒక స్థాయివరకు మాత్రమే జరిగినట్టిది. వివరణ ఇచ్చేటప్పుడు దేశ కాల పాత్రాలు కూడా ప్రాముఖ్యం వహిస్తాయి.

సాధన అన్నది మాటలూ, వ్రాతలతోకాదూ అన్నారు. నా దృష్టిలో మాటలూ, వ్రాతలూ కూడా సాధనలోని భాగాలే! మాస్టరుగారి మాటలను వ్రాతలనూ సేకరించి అధ్యయనం చేయాలనే కదా, మనమందరమూ ఇప్పుడు తపన పడుతున్నది. మాటలూ, వ్రాతలూ అన్నవి జరుగుతున్న తపస్సుకు ఫలితాలు.

ప్రేమతో

..............

## మెట్లెక్కి వచ్చి

విజయవాడ

యోగమిత్రులూ,ఆత్మీయులూ........గారికి ప్రేమతో వ్రాయునది 8-8-91

మీరు వ్రాసిన ఉత్తరం అందింది. నేనొక ప్రణాళిక మధ్యలో ఉన్నాను. చేసికొంటూ వెళ్ళిపోవలసిన ప్రణాళిక అది. కదలడానికీ, తిరగడానికీ అవకాశాన్నీయదు. అందుకనే నేను మెట్లు దిగి క్రిందకు రాను. ఆత్మీయులయిన వారు ఆ మెట్లెక్కి వచ్చి, జరుగుతున్న పనిలో పాలు పంచుకొని వెళుతూ ఉంటారు.

ప్రేమతో

....................

## శుభలేఖ

విజయవాడ

ఆత్మీయులు...........గారికి శుభాకాంక్షలతో వ్రాయునది 29-8-91

నిండు ప్రేమతో మీరుపంపిన శుభలేఖా, మీరువ్రాసిన లేఖా అందాయి. మాస్టరుగారి జన్మదినోత్సవం అన్ని ప్రాంతాలలోనూ దివ్యవైభవంతో జరిగినట్లుగా అనుభవానికి వస్తున్నది. మాస్టరుగారి ప్రణాళిక ఒక సరిక్రొత్త మలుపు తిరుగుతూ ఉన్నట్లుగా భాసిస్తున్నది. మలుపు తిరిగే వేళ మనం ఉండటమే మన అదృష్టం. మాస్టరుగారి అనుగ్రహం కూడా.

ఒకరి కొకరై జీవితములను కలబోసికొనబోవుచున్న నవ దంపతులకు ఇవే మా అందరి శుభాకాంక్షలు. మాస్టరుగారి ఆశీస్సులు వారిని

వెన్నంటి రక్షించగలవు. ముసుముందుకు నడిపించగలవు. వారి స్మరణలో ఒకరి కొకరు దగ్గరవుతున్న ఈ దంపతులు ధన్యులు. దేశ శ్రేయస్సుకు పట్టుకొమ్మలు కాగలిగిన సార్థక జన్మలు.

అందరికీ ఆశీస్సు

...............

# శ్వాస గా...

విజయవా

పూజ్యులు........లకు నమస్సులతో వ్రాయునది.

మీ ఉత్తర మందినది. చాలా బాధ కలిగినది. శబరి వంటి అక గారు శరీరాన్ని విడిచిపెట్టడమన్నది మనందరికీ తీరని లోటే మరి! విషయంలో అది మరీనూ! మీ మధ్యగల అనుబంధం, అనురాగ బం అంతటిది! ఇప్పటికి, ఎప్పటికి శ్రీమన్నారాయణుని పాదాల చెంత ఆ అలా పూలమాలలను కట్టుచునే ఉండగలదు. నారాయణుని సన్నిధిలో దివ్య వైభవాన్ని వివిధ లోకముల వారికి చాటుచునే ఉండగలదు. స్వా స్మరణయే శ్వాసగా జీవించిన ఆమె శ్వాసను విడువలేదు. శరీరాన్ని వి శ్వాసగా మిగిలినది. శాశ్వత లోకముల నుండి మనకై స్వామి కరుణ గుమ్మరించుచునే యున్నది.

## అనుభూతి

విజయవాడ

ఆత్మీయులు........వారికి శుభాకాంక్షలతో వ్రాయునది 2-9-91

కార్యక్రమాలన్నీ సజావుగానూ, శుభకరంగానూ జరుగుతూ ఉన్నాయి కదా! మాటలు-మంత్రాలు రెండవ భాగానికి మీరు వ్రాసిన ముందు మాట చాలా బాగా వచ్చింది. మన ఇరువురి హృదయాల మధ్య కుదిరిన శ్రుతిని అది వినిపించింది. మన వారు చాలామంది ముఖ్యంగా మన కందర్ప ముందుమాట చదివి చాలా సంతోషాన్ని వ్యక్తం చేశారు. హృదయం వికసించిన వారు వ్రాసినప్పుడు అది ఏదైనా హృద్యంగానే ఉంటుంది. మరో హృదయాన్ని మీటుతుంది. మరపురాని అనుభూతిని కలిగిస్తుంది.

ప్రేమతో

................

## అభిలాష

విజయవాడ

ఆత్మీయులు........గారికి ప్రేమతో వ్రాయునది 2-9-91

బందులూ, ఇబ్బందులూ ముగిసినట్లున్నాయి. పని ఇబ్బడి ముబ్బడిగా ఉన్నట్లున్నది. ఎంత పనిలో ఉంటే మాత్రం సరసాల్లో నవరసాలను మీరు ఇలా సగంలో ఆపివేయవచ్చునా !

తెలివి గలవారు మీరు. మీ తెలివికి పద్ధతి కూడా తోడయితే ఎంత బాగుండును! పని మరింతగా జరుగును కదా! అని అనుకొంటూ ఉంటాను నేను. కాని మీరు చేస్తున్న పనికీ, పద్ధతికీ అంతగా సరిపడదేమో! అని మళ్ళీ అనుకుంటాను. ఏది ఏమయినా సహృదయంతో కూడిన తెలివి తేటలు అన్నివిధాలా సద్వినియోగం కావాలి అన్నది నా అభిలాష.

ప్రేమతో

..............

# శాశ్వత రూపాలు

విజయవాడ

........కు ప్రేమతో, 15-9-91

ఉన్నట్లుండి నీకు ఉత్తరం వ్రాయాలని అనిపించింది. మన సంస్థ నుండి వెలువడుతున్న గ్రంథాలన్నింటినీ వెలువడిన వెంటనే చదివి, పది మందికి చదివి వినిపించే లక్షణం నీకున్నది. ఎంతోమందికి నీవు మన గ్రంథాలను సమయోచితంగా చదివి వినిపిస్తూ ఉంటావు. వారి సంస్కారాలను మలచుకొనేందుకు వీలుగా, వారి కర్తవ్యాలను గ్రహించుకొనగలిగే టట్లుగా ఆయా గ్రంథాలలోని అంశాలను తోటివారికి చదివి వినిపించే మంచి లక్షణం నీలో పుష్కలంగా ఉంది. ఆ గ్రంథాలు వ్రాయబడుతున్న కూడా అందుకే! అలా సద్వినియోగం చేయబడేటందుకే!

ఇటీవల వెలువడిన మన నూతన గ్రంథాలనన్నింటినీ చదివి ఉంటావని అనుకొంటున్నాను. అవి ఎలా ఉన్నాయి? వాటిలోని పై విధ్యం ఉన్నది? తోటివారితో నీవు సహచరిస్తున్నప్పుడు ఈ నూతన గ్రంథాలు నోటినుండి ఎలా సద్వినియోగమవుతున్నాయి ? ఈ విశేషాలను నీ ద్వారా వినాలని ఉంది. అసలు ఇప్పటికే నీవు వినిపించి ఉండవలసింది.

మన వాళ్లందరూ మన గ్రంథాలను ఎప్పటికప్పుడు వచ్చిన వాటిని
చ్చినట్లుగా చదవడం ప్రారంభించాలని నా ఆకాంక్ష. నానుండి వస్తున్న
ంథాలు మీ మీదుగా లోకాని కంతటికీ అందాలి. అంటే నానుండి ఇటు
స్తూ ఉంటే, మీరు అటునుండి చదివేస్తూ ఉండాలి. పదిమందితో చది
స్తూ ఉండాలి.

కొంతమంది తెలియక మనం మాస్టరుగారితోనే ఉన్నాం కదా! వారి
క్కులను నిరంతరం వింటూనే ఉన్నాం కదా! గ్రంథాలలో ఉండేవి
డా ఈ వాక్కులే కదా! నిదానంగా చదువుకో వచ్చులే! 'అని బద్ధ
• ఉంటారు. తమకు తెలియకుండానే తాము అశ్రద్ధపరులవుతుంటారు.
స్టరుగారు మనతో ఉన్నా, మనం మాస్టరుగారిని చూడగలుగుతున్న
ంత? ఆ వాక్కుల నుండి మనం పట్టుకోగలుగుతున్నది ఎంత?' ఇది
నం ఆలోచించుకోవాలి. అలాంటి వాక్కులను రసవత్తరమయిన
పంలో మనకు పట్టి అందించ గలుగుతున్న గ్రంథాలకు మనం కృతజ్ఞు
మై ఉండాలి. మాస్టరుగారి యొక్క నిజ స్వరూపం, పూర్ణ స్వరూపం
డగట్టేది ఆ గ్రంథాలలోనే! అవి ఆయన శాశ్వతరూపాలు. అని మనకు
లియాలి. ఏమంటావు? అవును అంటావు.

ప్రేమతో

................

# ఆనందధామం

విజయవాడ

ఆత్మీయులు........గారికి ప్రేమతో వ్రాయునది. 16-9-91

ఆ ప్రాంతమంతా కరువు కాటకాలతో విలవిలలాడుతూ ఉన్నదని
పేపర్లలో వార్తలు చెబుతున్నాయి. యదార్థ దృశ్యాలు ఇంకా భయావహం

గానే ఉండి ఉంటాయని అనిపిస్తూ వున్నది. ఇప్పటికిది ఎన్నవసా
ప్రాంతం ఇలా సంక్షోభం చెందడం! మనస్సుకు చాలా బాధగా వు
ఆ ప్రాంతానికి తగిన విధంగా శాశ్వతమయిన ఏర్పాటు జరగాలి
ఏర్పాట్లకు గాను త్వరలోనే శ్రీకారం చుట్టబడగలదని అనిపిస్తు

మాస్టరుగారి ప్రేయరు అఖండంగా జరుగుతున్న ప్రాం
ఆయన స్మరణ ఉన్నచోటున అన్నపానాలకు లోటుండదు. ఉండకు
మీ అందరినుండి జరుగుచున్న మాస్టరు స్మరణ ఆ ప్రాంతాన్ని
ధామంగా పరిణమింప జేయు గాక!

శ్రే

.........

## నిజమయిన మనిషి

విజ

ఆత్మీయులు శ్రీ........గారికి ప్రేమతో వ్రాయునది.

మీరు ఇక్కడికి వచ్చారట. నేను ఆ రోజున విశాఖలో ఉ
రాగానే కార్యకర్తలు చెప్పారు. మీరూ, ఆమె కలసి వచ్చారని. ప్రే
వీలుచేసికొని వచ్చారు. నా మనస్సునకు సంతోషమైంది. ప్రేమ
టిది కదా! అని అనిపించింది.

వచ్చినందుకు కొన్ని క్రొత్త పుస్తకాలు వెంట తీసికొని వె
తెలిసింది. వాటిని చదువుతూ ఉండి వుంటారు. ఎలా ఉన్నాయా గ్రం
మీకు నచ్చాయికదా! ఎప్పటికీ నిలచిపోయే సంపద అవే. ఈ జీవితం
జాతికి అందుతున్న తీపిగుర్తులవి. నిజానికి నిజమయిన మనిషి ఆ గ్ర
లోనే నిలచి ఉన్నాడు.

ఒకసారి హైదరాబాదు వెళ్లినప్పుడు కొందరు చూడవచ్చారు! 'మీ గ్రంథాలద్వారా మిమ్మల్ని ఇదివరకు చూశాం. ఇవ్వాళికి మిమ్మల్ని చూడగలుగుతున్నాం.' అన్నారు వాళ్ళు. నేనన్నాను కదా! 'మీరు గ్రంథాల ద్వారా పరిచయం చేసికొన్న కృష్ణస్వామే నిజమైన కృష్ణస్వామి' అని. ఆ నిజమయిన కృష్ణస్వామితో మీకు పరిచయమున్నది కదా! కాకపోతే అతని ఉపాధిని మాత్రం మీరిప్పుడు చూస్తున్నారు. అంతే! అన్నాను. వారు ఆశ్చ ర్యంగా ఆనందిస్తూ చూస్తున్నారు. తీసుకువెళ్ళిన గ్రంథాలను చదువుతూ ఉన్నకొద్దీ, మీకూ ఇలాగే అనిపిస్తూ ఉన్నదని నాకిక్కడ అనిపిస్తూఉన్నది ఏమంటారు.

ప్రేమతో

.................

# స్వయంగా శ్రీకారం

విజయవాడ

ఆత్మీయులు శ్రీ.........గారికి ప్రేమతో వ్రాయునది. 21-9-91

నిత్యసత్యాలు-ఆణిముత్యాలు అందుకొన్నట్లుగా మీరు వ్రాసిన లేఖ అందినది. మాటలు-మంత్రాలు గ్రంథం మీకందించిన అనుభూతిని వ్రాశారు. ఆ అనుభూతి చిరకాలం స్మరించుకోదగినదిగా ఉన్నది. గుండె గొంతులో కదలాడినవేళ వెలువడిన అంశాలే మాటలు-మంత్రాలు.

నిత్యసత్యాలు-ఆణిముత్యాలు బాలబాలికల కోసం జరుగవలసిన కృషిని గమనించుకొని, ఒడలు వంచి శ్రీకారం చుట్టగా రూపొందిన గ్రంథాలివి. సర్వసామాన్యంగా నేను గ్రంథాలను ఆత్మీయులయిన వ్రాయస గాళ్ళకు డిక్టేటు చేస్తూ ఉంటాను. అలాగాక ఈ నిత్యసత్యాలు-ఆణిము

లను కావాలని నేనే స్వయంగా వ్రాసి తయారుచేశాను. వ్రాత ప్రతులు, శుద్ధప్రతులు అన్నీ ఈ నా చేతిమీద తయారయినవే! బాలబాలికల యెడల మచ్చటతో అలా చేశాను. మీలాంటి పెద్దలు, విద్యారంగంలో నిలద్రొక్కుకున్నవారు కలసి వచ్చిన కొద్దీ బాలబాలికల కోసం జరుగుతున్న ఈ కృషి మరింతగా కొనసాగుతుంది! వర్ధిల్లుతుంది!

................

# సన్న్యసించండి

విజయవాడ

పితృతుల్యులు....గారికి నమస్సులతో వ్రాయునది 21-9-91

"చేయదలచినది కాదు చేయవలసినది చేయాలి" అన్నది మాస్టరు గారి సూక్తి. ఈ సూక్తి ప్రకారం ముందుగా మీరు చేయవలసినది 'నోట్సు'లను గ్రంథాలుగా రూపొందించడం, మాస్టరుగారు డిక్టేటు చేయగా రూపొందినవి వారి రచనలు. మరి వారి ప్రవచనాల మాటేమిటి ? ఆ ప్రవచనాలలో వారు వెలువరించిన అనేకానేక అంశాల మాటేమిటి ? ఏళ్ళతరబడి చేశారే ప్రవచనాలు. వారి ప్రవచనాల ముందు వెలువడిన వారి రచనలు రాసిలో ఎంత ! ఇప్పుడు మీరా పనిని మొదలు పెడితే, ఇప్పటికి వెలువడిన రచనలకన్నా కనీసం రెండింతల గ్రంథాలు జాతికి అందుతాయి. ఈ బృహత్కార్యక్రమానికి మీరు పూర్తిగా అంకితంకండి. మాస్టరుగారు ఇన్నాళ్ళుగా ఇన్నేళ్ళుగా అందిస్తూ వచ్చినది 'ఇది' అని అందించవలసినది మీరే !

ఆ ప్రవచనాలలో రామాయణమున్నది. భారతమున్నది. దివ్యజ్ఞానమున్నది. వేదోపనిషత్తులున్నవి. ఒకటేమిటి ? ఎన్నో ఉన్నవి. మళ్ళీ

మధ్యలో ఎన్ని విశేషాలు! ఎన్ని విశేషాంశాలు! ఎన్ని సరసాలు! ఎన్ని సందేశాలు! వాటి నన్నిటినీ ఏర్చి కూర్చండి. జాతి సంతోషిస్తుంది.

మీకు మొహమాటమెక్కువ. మాస్టరుగారి కొరకు, ఈ మానవ జాతి కొరకు దానిని సన్న్యసించండి. అవసరమైన వాటిని సాధించడం కోసం, అనవసరమైనవాటిని, లేదా అంతగా అవసరంలేని వాటిని సన్న్యసించ గలగటమే నిజమయిన సన్న్యాసం బట్టల్నీ, బిడ్డల్నీ సన్న్యసిస్తే ఏమిటొస్తుంది చెప్పండి ? ఎదురవుతున్న అడ్డులను సన్న్యసించాలి. ఇప్పుడు మీరాపనిని చేయండి. జాతికి చేరవలసిన ఆస్తి మీ దగ్గర ఉన్నది. దానిని సమంగా, సక్రమంగా జాతికి అందించడంలో నిమగ్నులుకండి ! ఇది ప్రేమతో, ఆర్తితో నేను చేస్తున్న శాసనమని గ్రహించండి.

................

## సాగినకొద్దీ

విజయవాడ

ఆత్మీయులు........గారికి ప్రేమతో వ్రాయునది. 28-9-91

మీ యోగక్షేమాలు తెలుస్తూనే ఉన్నాయి. మీ తపన తపస్సై, ఇహపరాలలో ఒక స్థాయికి చేరుకున్నారు మీరు. అన్ని విధాలా అభ్యుదయాన్ని మీరూ, మీ బిడ్డలూ సాధిస్తున్నారని తెలిసి నప్పుడల్లా నాకు చాలా తృప్తికలుగుతూ ఉంటుంది. దైవం మీ కుటుంబాన్ని అనుగ్రహించాడు. మీరు ధన్యులు. ఆ వెలుగులో అలాగే ముందుకు సాగండి. సాగిన కొద్దీ సారథి మీకు చేరువవుతాడు. మరింతగా !

శుభాకాంక్షలతో

................

# జీవనయాత్ర

విజయవాడ

ఆత్మీయులు........గారికి ప్రేమతో వ్రాయునది. 28-9-91

ఎలా ఉన్నారు మీరు? వయస్సు మీద పడుతున్నా దేహాన్ని దెబ్బ తినకుండా నాజూకుగా కాపాడుకుంటూ వస్తున్నవారు మీరు. మరి మనస్సు విషయంలో కూడ అలాంటి నాజూకయిన జాగ్రత్తనే వహిస్తున్నారని అనుకుంటున్నాను. కుటుంబం యెడలా, సమాజం యెడలా, మీ వంతు కర్తవ్యాన్ని దశాబ్దాల తరబడి నిండుగా నిర్వహించిన వారు మీరు. మీ జీవన యాత్ర మీకే కాదు. మన ప్రాంత ప్రజలకే తృప్తిని కలిగించి నట్టిది. అట్టి మీరు అదే తృప్తితో అదే తృప్తిలో ముందుకు సాగాలి.

భగవంతుడు ఎప్పుడూ మీతో ఉన్నాడు. స్మరించినచోట కాక అతడింకెక్కడ ఉంటాడు.

శుభాకాంక్షలతో

................

# అతీతమైనది

విజయవాడ

ప్రియమిత్రుడు........కు ప్రేమతో వ్రాయునది. 28-9-91

మనం కలిసి చాలా కాలమైంది. మీ శ్రీమతీ, పిల్లలూ ఎలా ఉన్నారు? పిల్లల చదువులు ఎలా ఉన్నాయి?

నీవు తరచు మన కార్యాలయానికి వస్తూ ఉండవలసింది. నీవు ఇక్కడికి తరచుగా రావలసిన వాడివి. ఎందుకో తగ్గించావు. నాకు రెండు కారణాలు కనబడుతున్నాయి. అనేక కార్యక్రమాలను ఏకకాలంలో నీవు తలపెట్టడం ఒకటి. నీ ద్వారా వచ్చిన రోగార్తులు కొన్ని సమయాలలో మన వైద్యాలయంలో ఇబ్బందికి గురికావడం మరొకటి.

ఈ రెండో అంశాన్నిగూర్చి నేను నీకు చెప్పాలి. ఒక మిత్రునిగా నేనెప్పుడూ ఒకలాగే నీతో ఉంటాను. ఒక కార్యకర్తగా కార్యక్రమానికి తగిన క్రమశిక్షణను నేను కోరుతాను. దానికి నీవు కూడా నాకు సహకరించాలి. ఒక ఊళ్ళో ఉంటూ ఇలా ఉండటం నాకు బాగుండలేదు. తరచు మనం కలుసుకుంటూ ఉండాలి. కలిసి పనిచేసికొంటూ ఉండాలి. స్నేహ ధర్మం అనేది అన్నింటినీ మించినది. స్నేహధర్మంలో అనుమానాలకు ఆస్కారంలేదు. రాగద్వేషాలకు ప్రవేశంలేదు. హోదాలూ, స్థాయీ భేదాలు దానికి అడ్డుపడలేవు. భిన్నదృక్పథాలు దానికి అడ్డుకావు. స్నేహమంటే అదీ! అన్నింటికీ అతీతమైనది.

.................

## కాలగతి

విజయవాడ

ఆత్మీయులు........గారికి ప్రేమతో వ్రాయునది. 28-9-91

అందరూ క్షేమమేకదా! మనము కలిసి చాలాకాలమైనది. కలవడమనేది కాలము చేతిలోపని. కాలమనేది ఎప్పుడూ ఒక తీరున నడిచేదికాదు.

అయితే కాలగతిని ఎరిగి దాని ప్రకారం వర్తించిన వారికి ఎప్పుడూ దయమే లభిస్తుంది. కాలం మనకొరకే అన్ని పోకడలు పోతు తెలుస్తుంది.

మీ దైవ స్మరణ నిరాఘాటంగా సాగుతోంది కదా! మీ దంపతు దిన చర్య దివ్యంగా నడచిపోతూ ఉన్నదికదా! దైవం మిమ్ములను అన్ని విధాలా సాకగలడు! మీకు ఏది కావాలో అది అతడు కాగలడు.

శ్రీ

..........

# దేహాలను దాటుకుంటూ

విజయ

చిరంజీవికి................ 4-1

మా నాన్నగారిద్వారా నిన్నటిరోజున ఈ వార్త విన్నాను. రోజున ఈ ఉత్తరం అందింది. చాలా బాధ కలిగింది. ఆ బాధను లలో పెట్టలేను.

క్రిందటినెల 28 వ తేదీన అక్కడి మన పెద్దలకు లేఖలు న్నాను. ఆ సందర్భంలో అన్నయ్య నా కళ్ళముందు కనబడ్డాడు. ఇ కూడా లేఖ వ్రాయాలి అనిపించింది. పెద్ద విశేషాలు లేవు, కాని వ్రా ఉత్తరం వ్రాయడం ప్రధానం అని వ్రాశాను. ఆవిధంగా అతన్ని స్మ కున్నాను. ఆ లేఖ వ్రాయబడిన కొద్ది గంటలలోనే అతడు దేహత్యా చేశాడు. లేఖ అతడు అందుకోక పోవచ్చు. నా స్మరణ అతనికి అ తుంది. స్నేహానికి మరణంలేదు. దేహాలను దాటుకొంటూ అది కొనసా తుంది.

# పద్ధతి రావాలి

విజయవాడ

...జీవి.......కు ఆశీస్సులు. 6-10-91

మీ శ్రీమతి ఆరోగ్యం ఎలా ఉన్నది. చాలా అశ్రద్ధ జరుగుతోంది. ... మధ్య అభిమానం ఎంత ఉన్నా, కర్తవ్యం యెడల శ్రద్ధ పెట్టలేన ...ుడు జరిగేది చాలా తక్కువగా ఉంటుంది. నీ జీవితానికి ఇంకా పద్ధతి లేదు. మీ శ్రీమతికి కూడా ఆవేశపుపాలు ఎక్కువ. సమన్వయం ...క్కువ. లభిస్తున్న సహకారాన్ని అందుకోవడానికి కూడా అశ్రద్ధ చేస్తు ...న్నారూ అంటే ఏం చెప్పాలి ! అవకాశాలు లేనివాళ్ళు లేక బాధపడుతు ...న్నారు. మీరు, అవకాశాలు ఎదురుగా ఉండికూడా వినియోగించుకోలేక ...తున్నారు. మీ పద్ధతి మారాలి ! మీకు పద్ధతి రావాలి !

ఆశీస్సులు

...............

# చేస్తున్న కొద్దీ

విజయవాడ

...రంజీవి................కి ఆశీస్సులు. 6-10-91

నేను వ్రాసిన లేఖ మీకు అంది ఉంటుంది. అక్కడ మన కార్యక్ర ...మాలు క్రమంగా ఒక రూపాన్ని ధరిస్తాయి. ఎవరి పాత్ర పోషణకు వారు ...ద్ధులు కండి!

ఎంత పనిని చేస్తున్నాము అని చూడకండి. చేస్తున్న పనిని శ్రద్ధగా ...ండి. మనం శ్రద్ధగా చేస్తున్నకొద్దీ మనసుండి జరిగే పని యొక్క ...న్నా క్రమంగా పెరుగుతుంది.

.................

# అభినందనలు

విజయవాడ

ప్రియ సోదరులు........గారికి శుభాకాంక్షలతో వ్రాయునది 16-11-91

సద్గ్రంథ పఠనాభిలాషతో చిరునామాను వెతికి పట్టుకొని ఇంతకాలానికీ, ఇంత దూరానికీ లేఖ వ్రాసిన మీకు అభినందనలు. మీలాంటి సహృదయులూ, రసజ్ఞులూ ఉన్నంతవరకు మంచి గ్రంథాలు వెలువడుతూనే ఉంటాయి.

సరయిన రచయిత విలువైన తన గ్రంథాలను రచించేది ఇలా కోరి స్వీకరించే వారి కోసమే!

ప్రేమతో

...............

# ఏమి కావలయును !

విజయవాడ

సజ్జనులు........గారికి ప్రేమతో వ్రాయునది. 23-11-91

మీరు వ్రాసిన లేఖ అందింది. ఎప్పటికి ఏది ప్రాప్తమో ఎవరు చెప్పగలరు! కానీయండి. మొత్తముమీద సత్కాలక్షేపము చేయుచున్నారు. ఈ వయస్సున మనస్సు కూడా అదే కోరునేమో !

మనస్సునకింత నిలకడ లభించిన అంతకన్న ఏమి కావలయును? నమ్మినదానిని విడువకుండుట చేత కావలయును. పది చోటులకు పరిగెత్తి ఏమిఫలము! ఉన్నచోటుననే, కుదురుకొన్న చోటుననే ఉన్నత శిఖరాలను అందుకోవలయును. ఇంతకునూ కుదురుకోవలయును. మన మనస్సు కుదురుకోవలయును,

జనవరి 11,12,13 తేదీలలో మనసంస్థ విజయవాడలో గురుపూజా మహోత్సవాలను నిర్వహిస్తున్నది. ఆ వేళకు వీలుచేసికొని రండి.

ప్రేమతో

...............

## ఇన్నిటిలోనుండి

విజయవాడ

ప్రియ సోదరుడు........కు ప్రేమతో వ్రాయునది 30-11-91

నిండు మనస్సుతో నీవు వ్రాసిన ఉత్తరం అందినది. అమ్మగారిని గూర్చి నీ ఆర్ద్రమయిన భావన నా మనస్సును సార్ధకంగా సోకింది. భాగవతంలో చెప్పబడినట్లుగా సర్వమూ కాలానికి వశమై సాగిపోతోంది. సన్నివేశాలు మనిషి చేతుల్లో ఉండవు. నడుస్తున్న సన్నివేశాల యెడల ఎలా ప్రవర్తించాలన్నదే నరుడు చేయవలసిన సాధన.

ఇటీవల ఒకానొక సన్నివేశాల వరుస-వరుసగా నన్ను కుదిపి చూస్తున్నది. కాలమహిమను చూస్తూ కథవెంట సాగవలసి వస్తోంది. ఒక్కొక్క రోజున గుండె బరువెక్కుతున్నది. ఒక్కొక్క రోజున మనస్సు కొంచెం తేలిక పడుతుంది. మొత్తంమీద కథ ఆగకుండా సాగిపోతోంది. తనకు కావలసినట్లుగా సాగిపోతోంది. మనం కోరవలసింది అదే కదా!

ఇన్నింటిలోనుండి ఒక విశ్వాసం-జరుగవలసినది జరుగుతున్నది అని. జరుగవలసింది జరుగుతుంది అని. ఆ విశ్వాసమే నడిపిస్తున్నది. ఆ విశ్వాసమే పలికిస్తున్నది.

ప్రేమతో

........ .......

# ఒక్క షరతు

విజయవాడ

ప్రియసోదరుడు........కు ప్రేమతో వ్రాయునది.

మీది మానసికంగా ఎంత అన్యోన్య దాంపత్యమో భౌతికంగా అంత అనారోగ్య దాంపత్యం అయితే ఎలాగ? ఆమె అనారోగ్యం నుండి పూర్తిగా బయటపడిందా? పిల్లలెలా ఉన్నారు? మమకారం చూపడం ఎంత అవసరమో, ఆవశ్యకమయిన అంశాలలో శ్రద్ధ పెట్టడంకూడ అంతే అవసరం కదా! ఈ విషయమైనా సహకారం మీరు పొందగోరినట్లయితే అందించడానికి నేను సిద్ధమే! దానికొక్కటే షరతు. మీరు క్రమశిక్షణతో ఆ సహకారాన్ని అందుకోవాలి.

ప్రేమతో

................

# అనుగ్రహ ఫలం

విజయవాడ

ప్రియ సోదరునకు శుభాకాంక్షలు. 3-1-92

ఒక విశేషం. శ్రీమద్భాగవతము—దివ్య జీవన మార్గము అనే ఒక విశిష్ట గ్రంథం మననుండి మాస్టరుగారి ఆశీస్సులతో రూపొందింది. మాస్టరుగారు రచించిన భాగవత రహస్య ప్రకాశానికి పరిపోషకమైన గ్రంథమిది! ఇది చదువుకొని భాగవత ప్రకాశం చదువుకుంటే సులువుగా బోధపడుతుంది. భాగవతప్రకాశం చదువుకొని ఇది చదువుకుంటే భాగవత సందేశం

ఒంటపడుతుంది. ఇది భాగవత రహస్యానికి కొనసాగింపు కాదు. భాగవతానికి మరో కోణంనుండి దిగివస్తున్న దివ్య వివరణ. మాస్టరుగారి అనుగ్రహఫలం !

ప్రేమతో

...............

## పుణ్య విశేషం

విజయవాడ

పూజ్య మిత్రులకు శుభాకాంక్షలతో వ్రాయునది. 15-1-92

మీరు వ్రాసిన ఆత్మీయమైన లేఖ అందినది. మాకు ఎనలేని సంతోషం కలిగినది. మీవంటి పెద్దలు భావనా ప్రపంచమున ఇంతగా కలిసి వచ్చుట పురాకృత పుణ్యవిశేషం. దైవానుగ్రహమునకు ఫలము. మీవంటి పెద్దల శుభాకాంక్షలతో గురుపూజా మహోత్సవాలు దివ్యంగా జరిగాయి.

నమస్సులతో

................

## అడుగు జాడలు

విజయవాడ

ఆత్మీయులకు శుభాకాంక్షలతో వ్రాయునది. 15-1-92

ప్రేమతో మీరు పంపిన డైరీ అందినది. సంతోషమైనది. స్నేహమనిన ఇట్టిది కదా అనిపించినది.

గుంటూరులో కూడ మన ఉద్యమానికి పునాదులు పడుతున్నాయి. మీవంటి శ్రేయోభిలాషుల సహకారంతో అక్కడకూడా కార్యక్రమాలు పరంపరగా నిర్వహించే మంచిరోజులు రాబోతున్నాయి. ఇ.కె. మాస్టరు గారు చదువుకొని, ఉద్యోగము కూడ చేసిన ప్రాంతమది. ఆ ప్రాంత మంతా వారి అడుగుజాడలతో నిండిఉన్నది. ఆ జాడలలో జాతిని నడిపే టందుకు నేను గుంటూరు తప్పక వస్తాను.

ప్రేమతో

............

## ఓపిక పట్టాలి

విజయవాడ

పూజ్యులు...............గారికి ప్రేమతో, 23-1-92

మీ లేఖ అందింది. అందరూ బాగున్నందుకు ఆనందంగా ఉంది.

జరిగిన సన్నివేశాలు బాధను కలిగించాయి. కాని ఇకపైన బాగానే ఉంటుందని అనిపిస్తున్నది. పరిస్థితులు కొంతలో కొంత సర్దుకోగలవన్న ఆశ కలుగుతూ ఉన్నది. అమ్మాయికి ధైర్యం చెప్పండి.

దృఢచిత్తులమై మనం సాధించాలి తప్ప బేలతనం పనికిరాదు. మనస్సును కూడదీసుకొని మనుగడను సాధించుకోవాలి. కాలం ఎప్పుడూ ఒకేలా ఉండదు. అది కలసి వచ్చేవరకు కొంచెం ఓపిక పట్టాలి.

అమ్మాయి జీవితం తుమ్మపేళ్ళతో వంటలాగున్నది. పొగ ఎక్కువగా వస్తున్నది. జ్వాల విజృంభించి పొగ తగ్గిపోవుగాక !

శుభాకాంక్షలు

...............

## శంఖారావం

విజయవాడ

మహారాజశ్రీ........గారికి నమస్కారములతో వ్రాయునది. 23-1-92

మీరు వ్రాసినలేఖ, పంపిన చెక్కు అందాయి. ఉద్యమ సంచిక మీకు అంతటి ఆనందాన్ని కలిగించినందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. సహృదయులూ, శ్రేయోభిలాషులు అయిన మీవంటివారు మెచ్చితే నా దృష్టిలో అది దైవం వెన్నుతట్టి మెచ్చినట్లే! ప్రతి జీవి హృదయం లోనూ దైవముంటాడు. సహృదయులయిన వారి నుండి అతడు స్పష్ట మవుతూ ఉంటాడు.

మీరు సంకల్పించినట్లుగా, మీరు పంపిన ద్రవ్యాన్ని "శంఖారావం" మ్యాగ్జైన్‌కి చందాగా సంస్థకు సమర్పించాము. క్రమంగా శంఖారావం దశదిశలా మార్మ్రోగగలదు.

సమస్సులు

.................

## మాస్టర్ సి. వి. వి.

విజయవాడ

పూజ్యమిత్రులు........గారికి ప్రేమతో వ్రాయునది. 23-1-92

ఇ. కె. మాస్టరుగారు సి. వి. వి. గారిని గూర్చి 'మాస్టర్ సి.వి.వి.' అన్న పేరుతో ఒక గ్రంథాన్ని వ్రాశారు. ఈ గ్రంథంలో మాస్టర్ సి.వి.వి. జీవిత విశేషాలతో పాటుగా ఆధునిక యుగానికి కావలసిన సమన్వయాత్మక మైన రాజయోగ మార్గం కూడా మనకు లభిస్తుంది.

గ్రంథంలో ప్రతి వాక్యం మంత్రంలాగ మన చెవుల్లో మారుమ్రోగు తుంది. ఒక్కసారు చదివిచూడండి. చదివిన తరువాత ఆ అనుభూతిని నాకు వ్రాయండి. ఇంకా కొందరు సి. వి. వి. మాస్టరుగారిని గూర్చి గ్రంథాలు వ్రాశారు. కాని అందులో సూటిగా బోధపడేవి తక్కువ.

నమస్సులతో

................

## పుణ్యక్షేత్రం

విజయవాడ

సోదరులకు శుభాకాంక్షలు.

జరుగుతున్న కృషికి సంతోషంగా ఉంది. అమరావతివంటి పుణ్య క్షేత్రంలో ఈ కృషి జరుగుతూ ఉండటం ఇంకా సంతోషదాయకం. మన పుణ్యక్షేత్రాలన్నింటిలోనూ ఇలాంటి కృషి జరిగితే చాలా బాగుంటుందని పిస్తుంది.

ప్రతి సంవత్సరానికీ మీలో ఉత్సాహం పెరుగుతూ ఉండటం ఒక విశేషం. శ్రీ రామకృష్ణ వివేకానందులు మరింతగా మీ నుండి సేవా రూపాన వ్యక్తం కాగలరని విశ్వసిస్తున్నాను. సాధన 'సేవలలో పాల్గొం టున్న ప్రతి ఒక్కరికీ నా శుభాకాంక్షలు అందజేస్తున్నాను.

ప్రేమతో

................

## క్లిష్టతనుండి స్పష్టతకు

విజయవాడ
30-1-92

ప్రియసోదరులకు శుభాకాంక్షలు.

రచనలో క్లిష్టత తగ్గి స్పష్టత పెరగవలసి ఉంది. ముఖ్యంగా శ్లోక రచనలో! అప్పుడప్పుడూ వ్రాస్తూ ఉండటంవల్ల మీకు ఈ ఇబ్బంది కలుగుతోంది. కొంచెం వ్రాయడం పెరిగితే ఇబ్బంది తగ్గుతుంది. కాళిదాసు శ్లోకాలు చూడండి- ఎంత సరళంగా ఉంటాయో! భగవద్గీత శ్లోకాలు చూడండి- ఎంత బాగుంటాయో! అంతకుమించి క్లిష్టతను ఇప్పటి జాతి భరించలేదు.

ఒడుపు కుదిరేలోపున శ్రీ విశ్వనాధ కొన్నివేల పద్యాలను వ్రాసి చింపేశారట! ఒడుపు కుదిరిన తర్వాతగాని ప్రజలకు అందించడం మొదలు పెట్టలేదట. మీ ఉత్సాహానికి తగిన ఒడుపును మాస్టరుగారు మీకనుగ్రహిం చాలని కోరుకుంటున్నాను. మీ కృషి ఫలిస్తుందని విశ్వసిస్తున్నాను.

ఆశీస్సులు

................

## సంబరపడినది

విజయవాడ
30-1-92

శ్రీ చరణ రేణువులకు నమస్కరించి వ్రాయునది.

మీరు హృదయముతో వ్రాసిన లేఖ అందినది. "నిత్యజీవితానికి నియమావళి" మీకు అంతగా నచ్చినదని తెలిసి నా మనస్సు సంబరపడినది. సహృదయులూ, పుణ్యమూర్తులూ అయిన మీవంటి వారికి నచ్చుటయనగా

అదీ మా శ్రీమన్నారాయణునకు నచ్చుటయే! గురుదేవులయిన ఇ.
మాస్టరుగారి ఆశీస్సులు లభించుటయే!

నమస్సులతో

...............

# నిందించకండి

విజయవాడ

యోగమిత్రులు........గారికి శుభాకాంక్షలతో వ్రాయునది. 30-1-92

మీరు వ్రాసిన ఉత్తరం అందింది.

మీ మనస్సు పడుతున్న బాధ నాకు తెలిసింది. మీ పైన నాకు ద్వేషమూ లేదు. నిజానికి నేనెవ్వరినీ ద్వేషించను. ద్వేషించలేను.

రెండు సంవత్సరాలక్రితం ప్రభాకరశాస్త్రిగారి జన్మదిన సందర్భాన ఒకరింటి దగ్గర జరిగిన సమావేశంలో మీరు ప్రసంగిస్తూ ఇ. కె. మాస్టరు గారి పద్ధతినీ, కృషినీ వారిపేరు చెప్పకుండానే కొంతసేపు విమర్శించారు. ఇ. కె. మాస్టరుగారు నా సర్వస్వమూ అయిన కారణాన ఆ విమర్శ నాకు బాధను కలిగించింది. ఆ బాధను నా నుండి గ్రహించిన వారెవరో నేను మిమ్మల్ని నిందించినట్లు పొరపాటుగా చెప్పారు. ఆ చెప్పినవారికి బాధకూ, నిందకూ భేదం తెలియలేదు.

పెద్దలను మనం అవగాహన చేసికోవడానికే యత్నించాలిగాని, త్వరపడి నిందించకూడదు. అవహేళన చేయకూడదు. అందుకు మాస్టరు గారు అంగీకరించరు.

మాస్టరు సి. వి. వి. గారిని గూర్చి మీరు మంచి కృషిచేస్తున్నారని నాకు తెలుసు. ఆ కృషి ఇంకా కొనసాగాలి! మాస్టరుగారు మీనుండి మరింత లోకహిత కార్యక్రమాన్ని వ్యక్తం చేయాలని నేను కోరుకుంటు

న్నాను. మీరు చేస్తున్నకృషి మీకూ, మొత్తం సోదర బృందానికీ అక్క-రకు రావాలని కోరుకుంటున్నాను.

ప్రేమతో

................

## ఆనవాలు

విజయవాడ

ప్రియమిత్రులు........గారికి ప్రేమతో వ్రాయునది. 30-1-92

మీరు వ్రాసిన అభినందన లేఖ అందినది. 'దర్పణం' కార్యక్రమంలో ఆ శాస్త్ర పాత్ర పోషణ మీకెంతో సంతోషాన్ని కలిగించింది. అది మీ సహృదయతకు నిదర్శనం! మీలోని రసజ్ఞతకు ఆనవాలు! మీలాంటివారు ఇలాంటి అంశాలు కావాలని కోరుతూ ఆకాశవాణికి లేఖలు వ్రాయడంకూడా ఎంతైనా అవసరం. మీరు ఆ మంచి పని కూడాచేశారు. మీకు గల సామాజిక స్పృహను ఇది తెలియజేస్తుంది. ఘనులైన మీ పూర్వుల సంస్కారం మీలో మొగ్గతొడిగి ఉంది. ఆ మొగ్గ విచ్చుకోవాలి. పువ్వుగా వికసించి, మరింతగా పరిమళాన్ని వెదజల్లాలి. కాలం అందుకు అనుకూలించబోతున్నదని అనిపిస్తున్నది. దేనికైనా రూపునివ్వవలసింది కాలమే !

ప్రేమతో

................

# నేనెవరో నాకు తెలుసు

విజయవాడ

సత్యాన్వేషణా పరులకు శుభాకాంక్షలు.

మీరు వ్రాసిన ఉత్తరం అందినది. అందలి అంశాలు ఇదివరలో నేను విన్నవే! పరిశీలనలో నా ముందు ఉంచుకొన్నవే! ఆయా సందర్భాలలో ఈ అంశాలను గూర్చి ఉద్యమ శ్రేయోభిలాషులకు మనస్ఫూర్తిగా ఇస్తూ వచ్చిన సమాధానాలనే మీకూ వ్రాస్తున్నాను.

అధ్యయనం చేయవలసింది అనంతంగా ఉంది. జరుగవలసిన కృషి అపారంగా ఉంది. ఏరోజు కారోజు ఇదివరకటికన్నా మేలైన విద్యార్థిగా ప్రవర్తించడానికే నా నుండి జరుగుతున్న ప్రయత్నం. ఇంద్రియ నిగ్రహం విషయంలో నాకు నేనే సాక్షి. కాలమే దానికి తగిన న్యాయమూర్తి.

వ్యక్తులు అనేక విధాలుగా దగ్గరవుతారు. అందరూ అంతకాలమూ మనతో కలిసి కొనసాగడం సాధ్యమయ్యేపనికాదు. అందువల్ల వారిని ద్వేషించవలసిన పనిలేదు. పొన్నంతవరకు వారికి కృతజ్ఞులమై ఉండటమే మన ధర్మం. ఈ ఉద్యమంలో ఎవరినీ ద్వేషించవలసిన అవసరమూ లేదు, అవకాశమూలేదు. అయితే దూరమయిన వారు అనేక విధాలుగా భ్రమచెంది ఉండవచ్చును. నా నుండి ఎవరికయినా సహకారమే తప్ప మరొకటి లభించదు.

నేను గురువుననీ, మాస్టరుననీ ఎవ్వరితోనూ అనలేదు. ఎన్నడూ నేననుకోలేదు. పాత్రపోషణనుబట్టి పలువురు పలువిధాలుగా పిలుచుకొంటారు.

నేనెవరినో నాకు తెలుసు. నేనెక్కడున్నానో నాకు తెలుసును. కావలసిన వైపునకు ప్రయాణమును నిరంతరంగా చేస్తున్నవాడిని నేను.

తెలిసినది కూడా అందించడంలేదు అన్నది నాపై ఒక అభియోగం. అందిస్తున్నా అందుకోవడం లేదేమిటి అన్నది నా బాధ. విద్య అందుకోవా లన్న కోరిక, అందించడం లేదేమి అన్న నిరసనా చాలవు.

విద్యను అందుకోవడానికి దానిపట్ల శ్రద్ధ ఉండాలి. దానిని జాతి పరంగా వినియోగించడంలో దీక్ష ఉండాలి. ఈ రెండూ ఉన్నవారికి నా చెంతన ఉన్న ఏ విద్యనయినా అందించడానికి నేను సిద్ధంగానే ఉన్నాను. అందుకుంటున్నవారు లేకపోలేదు. వారి సంఖ్య పెరగాలి. అందుకోవాలి అనుకున్నవారు, అందుకోవడానికి కావలసిన అర్హతను పెంచుకోవాలి. అనుకుంటే చాలదు ప్రయత్నం కావాలి. ఈ అంశాలు మీకు తెలియనివి కావు.

నేను వ్యక్తులను వినియోగించుకుంటున్నాను అన్నది మరొక అభియోగం.

నా కొరకు నేనెప్పుడూ వ్యక్తులను ఉపయోగించుకోను. జాతి శ్రేయస్సుకొరకు వినియోగించడంలో ఏమాత్రం ఉపేక్షించను. జాతి శ్రేయస్సుకోసం పనిచేయడమే నాకు పని చేయడంగా వారు స్వీకరించినట్ల యితే ఈ అభియోగాన్ని నేను ఆనందంగా స్వీకరిస్తున్నాను. ఆశయసిద్ధి కోసం నేనుకృషి చేస్తాను. నాతో ఉన్నవారిచేత కృషి చేయిస్తాను. అలా చేయడం కోసమే వారు నాతో ఉన్నారని నేను అనుకుంటాను. ఆ చేస్తున్న ప్పుడు వారిలో వస్తున్న ఎదుగుదలను చూచి నేను ఆనందిస్తాను.

నా మాటలో కొంత పరుషత్వమున్నది. నా పైఖరిలో కొంత అసహనమూ ఉన్నది. క్రమం తప్పి వాటికి గురి అయినవారికి నాగురించి నొచ్చుకునే అవకాశం కలిగి ఉండవచ్చును. వాటినికూడ వారిపై ప్రేమ తోనే, వారిలో మార్పుకోరే నేను వ్యక్తంచేస్తూ వచ్చాను. మంచికోసం, మార్పుకోసం, మనం మనుష్యుల్ని ఇలా బలవంతం చేసి నొప్పించడం

కన్నా తగిన సమయాలలో ప్రోత్సహించి వదిలిపెట్టడమే మంచిదని ఈమధ్య నేనొక నిర్ణయానికి వచ్చాను. అప్పటినుండీ ఆ నిర్ణయాన్నే అమలుపరచే ప్రయత్నంలోనే ఉన్నాను. అంతకుముందు నా వలన నొచ్చుకున్నవాళ్ళకు, నేను వారిపై ఆధిపత్యాన్ని ప్రకటిస్తున్నట్లో, వారి స్వాతంత్ర్యాన్ని హరిస్తున్నట్లో ఉండవచ్చు. వారిని అలాంటి స్థితిలో పెట్టడం జరగకూడని పని అని నేను గ్రహించుకొన్నాను.

మంచిని చెప్పడమేకాదు. దానిని మంచిగా చెప్పడంకూడా సాధ్య కావాలి! అన్న నిర్ణయానికి వచ్చాను.

శుభాకాంక్షల

.............

# మీ పని మీరు చేయండి

విజయవా

పితృతుల్యులు శ్రీ...... .........గారికి నమస్సులతో వ్రాయునది.

వ్యాసం అందినది. దానితో లేఖకూడ ఉన్నది. లేఖ చదివి నా గుండె బరువెక్కినది. వ్యాసముకూడ ఆ బరువును పెంచినదే గా తగ్గించలేదు. దానియందు వృద్ధాప్యము కనిపించుచున్నది. శైథిల్యము గోచరించుచున్నది. మాటాడలేక మాటాడినట్లున్నది. మాటాడకుండ ఉండలేక మాటాడినట్లున్నది.

మీ సరదా ఏమయినది ? వయస్సునకు అతీతమైన సరదామీది. దగ్గరయినప్పుడల్లా మీలో మాకు సమవయస్కుడే కనిపించేవాడు. తోటి వారందరినీ నవ్వులలో ముంచెత్తగల సరదా మీది. సరదాలకు పరదాలు పడినట్లుగాఉంది. మీ మనస్సు ఒంటరితనాన్ని అనుభవిస్తున్నది. నాకు బాధగా ఉన్నది.

గ్రంథరచన చేస్తున్నానని వ్రాశారు. మీరు చేయవలసిన అసలు గ్రంథరచన మరి ఒకటి ఉన్నది. మాస్టరుగారి ప్రవచనాలను విని మీరు వ్రాసి ఉంచిన నోట్స్ నుండి వివిధ గ్రంథాలను కూర్పుచేయండి. అది మీరుమాత్రమే చేయగలిగిన పని. సబ్జెక్టు ప్రకారం తీసికొని ఆ కూర్పును ప్రారంభించండి.

అనువాదాలు ఎవరైనా చేయగలరు. మీ వ్రాతప్రతులను కూర్చగలవారు ఎవరు ? ఆలోచించండి. ఆ వ్రాతప్రతులు మీ చేత కూర్పుచేయబడితే మాస్టర్ ఇ. కె. వెలుగు ఇప్పటికి పదింతలుగా లోకమునకు అందినట్లు అవుతుంది.

ఆయన ఎన్ని చెప్పారు! ఎన్ని విధాలుగా చెప్పారు!! ఆ చెప్పబడిన వాటికి మీకన్న సాక్షి ఎవరు ? మీ కన్న లేఖకుడు ఎవరు ? సాక్షిగా, లేఖకునిగా ప్రోవుచేసిన ఆ పెరుగు కుండను చిలికి వెన్నను మా కందరకూ పెట్టండి. ఆ చిలకడంలో మరొక్కసారి మీరు చిలిపివారవుతారు. వెనుకబడిన సరదా ముందుకు వస్తుంది. వయస్సు తన ప్రభావాన్ని చూపలేక మీకు ఒదిగి నడుచుకొంటుంది.

పని పూర్తికావాలని మేడమ్‌గారు పట్టుబట్టారు అని మీరు అనేక సార్లు వ్రాశారు. ఈ ప్రతుల పని ఒకదారికి రావాలని మీరు పట్టుబట్టండి. మేడమ్ గారిని మరిపించండి. మేడమ్‌గారిని మీలో పొడగట్టించుకునే అవకాశాన్ని మాకు అందించండి.

నమస్సులు

...............

# కలసి వచ్చేవరకు

విజయవాడ

ఆత్మీయులకు 25-2-92

కాలం కలసివచ్చేవరకు ఓపిక పట్టక తప్పదు. మహనీయులు కూడా చేసినదిదే ! అయితే ఈలోపల సాధన చేయాలి. మాస్టరుగారి స్మరణను తపస్సుగా చేయాలి. పాండవులు అరణ్యవాసాన్ని ఉపయోగించు కున్నట్లు మనమీ సమయాన్ని ఉపయోగించుకోవాలి !

అందరికీ శుభాకాంక్షలు

...............

# చేతిలో ఉన్నది

విజయవాడ

చిరంజీవి...........కు ఆశీస్సులు 29-2-92

నీవు వ్రాసిన లేఖ అందింది. పరిస్థితులు బోధపడ్డాయి. ఇతరులను మారమని చెప్పటానికి మనకున్న అధికారం పరిమితమైనది. మనం మారడం మాత్రమే మన చేతిలో ఉన్నది. కనుక వివేకవంతుడయినవాడు తనను తాను తీర్చిదిద్దుకోవడానికే ఎక్కువగా ప్రయత్నిస్తాడు. పైథాగరస్ అనే మహానుభావుడు ఒకానొక సందర్భంలో ఒక మహోపదేశాన్ని చేశాడు. అది ఇది; ఈ ప్రపంచంలోని మూర్ఖుల సంఖ్యలో ఒక్కరిని తగ్గించు. అది నీవే ! 'ఈ ప్రపంచంలోని జ్ఞానుల సంఖ్యలో ఒక్కరిని పెంచు అదీనీవే!'

ఈ ఉపదేశం చాలా విలువైనది. మన చేతిలో ఉన్నది ఇది. మిగిలినవి మన చేతిలోనివి కావు. కనుక నిన్ను నీవు ప్రయోజకుడిగా తీర్చిదిద్దుకోవడానికి సంకల్పించు. తల్లి దండ్రులల్లోని లోపాలు అంటావా,

వాటిని సహించు. భార్యలోని లక్షణాలనుభరించు. ఏదిఏమైనా నీవు ప్రయోజకుడవైతే తప్ప వారునీకు తగినట్లుగా ప్రవర్తించడానికి ప్రయత్నించరు.

ప్రేమతో

..................

## ఆకాశమంత ఎత్తుకు

విజయవాడ

చి॥ సౌ॥ ........కి శుభాశీస్సులు. 15-4-92

పరిస్థితులు ఎలా ఉన్నాయి? ఎంతగా సంబాళించుకున్నా మాతృ వియోగం దుఃఖాన్ని కలిగించి తీరుతుంది. అయితే సంస్కారవంతులైన వారు ఆ దుఃఖంచేత కూడా ఉద్ధరింపబడతారు. దుఃఖం కలుగకూడదు అనరాదు. కలుగుతున్న దుఃఖం మనను ఉద్ధరించేది కావాలి.

శ్రీరామచంద్రుడు తండ్రి కోసం దుఃఖించాడు. తమ్ముని కోసం దుఃఖించాడు. భార్యకోసం దుఃఖించాడు. ఆ దుఃఖిస్తున్న క్షణాలలోనే ఆకాశమంత ఎత్తుకు ఎదిగి మనకు కనబడ్డాడు. ఈ సూక్ష్మాన్ని మనం గమనించుకోవాలి.

మన గ్రంథాలన్నీ నీ దగ్గర ఉన్నాయి కదా! అందులో మాటలు-మంత్రాలు 1వ భాగంలో 'తీరని బాధ-తీక్షైన బోధ' అని ఒక అధ్యాయం ఉంటుంది. అది చదువు.

శుభాశీస్సులు

..................

# స్మరణమే తప్ప మరణము లేదు

విజయవాడ

ఆత్మీయులు........గారికి శుభాకాంక్షలు 15-4-92

ప్రేమతో మీరు వ్రాసిన లేఖ అందినది. సంతోషమైంది. ఆ లేఖలో మీ హృదయం ప్రతిఫలించింది. మీ అనురాగ అమృతాన్ని ఆ లేఖ చదివిన కొద్దీ చవి చూపించింది.

మాస్టరుగారి సందేశం, మాస్టరుగారి సంకల్పం, మాస్టరుగారి సేవా కార్యక్రమం అమోఘమైనవి.చిరంజీవమైనవి.అవి లోకకళ్యాణార్థమై నిరంతరంగా కొనసాగుతూనే ఉంటాయి. మానవీయమైన ఆవేశ కావేశాలు వాటిని చెదరగొట్టలేవు సరికదా క్రమంగా అవికూడ వారి స్పర్శలో పునీత మవుతాయి. వారి సంకల్పంలోనికి సంగమిస్తాయి.

కాలం గడుస్తున్నకొద్దీ మాస్టరుగారి కార్యక్రమం విస్తరిస్తుంది. వారి సందేశం విశ్వమంతా వ్యాపిస్తుంది. వారి సంకల్పం కాల కాలాలలో ఎందరెందరినో స్పృశిస్తుంది, వరిస్తుంది, స్వీకరిస్తుంది. తీర్చిదిద్దుకుంటుంది. వేలకు వేలుగా వారిని జాతి పునర్నిర్మాణపథం పై పుకు నడిపిస్తుంది.

మాస్టరు సి.వి.వి.గారి తరువాత కూడా కొంతకాలం ఇంకేమున్నది అనిపించింది. కాని కాలం 'ఇంకా ఉన్నది' అని బదులిచ్చింది. ఇప్పుడూ అంతే! ఎప్పుడూ అంతే!

సూర్యుడు అస్తమిస్తున్నట్లుగా కనిపిస్తుంది కాని నిజంగా అస్తమిస్తున్నాడా! మనకలా కనబడుతుంది. మన కొరకు అలా కనబడుతుంది. మనకు విశ్రాంతి నివ్వడం కొరకు అలా కనబడుతుంది. నిజానికి అతడు అస్తమిస్తున్నాడా ? అతనికి అస్తమించడం అనేది ఉంటుందా ? మహనీయుల విషయంలోనూ అంతే! వారికీ, వారి కార్యక్రమానికీ మరణం అనేదిలేదు. ఒక రాముణ్ణి లేడు అనగలమా!

ఒక కృష్ణుణ్ణి లేడు అనగలమా! కనుక మన మాస్టరుగారు మనకు ఎప్పుడూ ఉన్నారు. మహనీయులకు స్మరణమే తప్ప మరణం ఉండదు. భూమి పైన వారి స్మరణం జరుగుతున్నప్పుడు వారికి మరణం ఎలా ఉంటుంది!

అలాంటి చిరంజీవమైన కార్యక్రమంలో పాలుపంచుకొంటున్న మన మందరం నిజంగా ధన్యులం.

శుభాకాంక్షలు

..................

## అక్షరం అక్షరమై

విజయవాడ

ఆత్మీయులు........గారికి శుభాకాంక్షలు. 15-4-92

మీరు వ్రాసిన లేఖ అందింది. అందులోని 'అక్షరాక్షరం'లోనూ మీ సహృదయమే కనిపించింది.

ఆంధ్రప్రభ వారపత్రికలో వెలువడిన మీ గేయం నాచేత మీకు లేఖ వ్రాయించింది. ఆ గేయం ఎంత ఉన్నది అన్నదికాదు ప్రశ్న. ఆ గేయం మీనుండి వెలువడటానికి వెనుక ఎంత ఉన్నతమైన సంస్కారం ఉన్నదీ అన్నది నా మనస్సు గమనించింది. మీ రచనలో జీవం ఉన్నది. అరుదుగా గాని అందని ఒకానొక దివ్యత్వమున్నది. రచనను ఒక సాధనగా స్వీకరించిన క్రమశిక్షణ ఉన్నదీ. లోకహితాన్ని రచనకు గమ్యంగా చేసికొన్న దివ్యప్రేమ ఉన్నదీ. ఇలాంటి మీ రచన ఇంకా కొనసాగాలనీ, మరిన్ని ఉత్తమమైన గ్రంథాలు మీనుండి వెలువడాలనీ, మీనుండి వెలువడుతున్న అక్షరం అక్షరమై వర్ధిల్లాలని శుభాకాంక్షలు అందజేస్తున్నాను.

ఇటువైపు వచ్చినప్పుడు ఇక్కడకు తప్పక రండి. మీ గ్రంథా లతో సహా రండి. కొంతసేపు ఆ సరస్వతీదేవి చరణసన్నిధిలో కాలాన్ని సద్వినియోగం చేద్దాం రండి.

... ...........

# ఎన్నడూ భద్రమే!

విజయవాడ

ఆత్మీయులకు శుభాకాంక్షలు. 15-4-92

శుభలేఖ అందింది. సంతోషమైంది. ఇంటికి కోడలు వస్తున్నది. మళ్ళీ ఇల్లు కళకళలాడుతుంది.

కోడలు రూపంలో మాస్టరుగారు మీఆలనా, పాలనా చూస్తారు ఇక! 'నా వెంట నుండువారికి ఎన్నడూ భద్రమే!' అన్నది మాస్టరుగారి మాట. అది మీపట్లకూడా నిజమవుతూ ఉన్నది. అందుకు సంతోషముగా ఉన్నది. ఈ శుభవేళలో మీకివే మా శుభాకాంక్షలు.

శర్మగారు దగ్గరకు వస్తున్నారు మీకు. ఇది కూడా ఒక శుభవార్తే! శుభాలు ఒక పరంపరగా మిమ్ములను సమీపిస్తున్నాయి. మాస్టరుగారి స్మరణలో నిండుగా నిశ్చింతగా ఉండండి.

శుభాకాంక్షలు

## సంకల్పం బాగున్నది

విజయవాడ

చి॥ సౌ॥......కి శుభాశీస్సులు 11-5-92

సంభాషణలు-సమన్వయాలు గ్రంథం నీకు నచ్చింది కదా! ఈ గ్రంథాన్ని గూర్చి నీవు వ్రాసిన అంశాలు అక్షర సత్యాలు. నీవు ఎప్పటి నుంచో ఈ ప్రణాళికకు చెంది ఉన్నావు. సమయం వచ్చింది కనుక ఇప్పుడు ప్రవేశించావు. మాస్టరుగారు నాతో మాట్లాడిన అంశాలకు రూప కల్పన జరగడంలో నీ పాత్ర యొక్క ప్రమేయం కూడ చాలా ఉన్నది.

ఈ గ్రంథాన్ని పత్రికల ద్వారా ప్రజలకు పరిచయం చేయాలన్న నీ సంకల్పం బాగున్నది. ఆ పని చేయవలసినది.

"నిత్యజీవితానికి నియమావళి"కి వలే ఈ గ్రంథాన్ని కూడ తగిన విధంగా ప్రజలలోనికి తీపికొని వెళ్ళగలవు. జనసామాన్యానికి ఈ గ్రంథం యొక్క అవసరం ఎంతైనా ఉన్నది.

శుభాశీస్సులు

............

## సంశయం నుండి సమర్పణకు

విజయవాడ.

ఆత్మీయులు........కు ప్రేమతో వ్రాయునది 26-5-92

విశేషాలతో నీవు వ్రాసిన లేఖ అందింది. ఏ అనుభూతి కోసం నీవు ఎదురు చూస్తున్నావో ఆ అనుభూతి నీకు తప్పక కలుగుతుంది. అయితే ఆ ఎదురుచూడటం కూడా ఆయన స్మరణలోనే, ఆయన స్మరణ

గానే సాగాలి. సంశయం ఉండకూడదు. కలుగుతుందా లేదాఅని అనిపించ కూడదు. సంశయిస్తున్నకొద్దీ ఆలస్యం కావడం దాని లక్షణం. "సంశ యాత్మా వినశ్యతి" అని గీతాచార్యుని వచనం. ఇంకా కలగలేదేమని నిరీక్షించకూడదు. అనుభూతిప్రదంగా ఆ నిరీక్షణ సాగాలి. పరీక్షిద్దాము అనే బుద్ధి అంత మేలైనది కాదు. 'ఇక్కడ చూశాము ఇక్కడ దొరకలేదు. అక్కడ చూశాము అక్కడ దొరకలేదు' అని వ్రాశావు. ఇంతకూ నీకు కావలసింది ఏమిటి? అది నీకు తెలుసా! నీవు ఏదో అనుకుంటున్నావు. అది నీకు కావలసిందిగా భావిస్తున్నావు! నీకు ఏది కావాలో, ఎప్పుడు కావాలో చూడగలిగినవాడు దైవం. సంశయించుట, పరీక్షించుట, నిరీక్షించుట అనే స్థితులనుండి సమర్పణ చెందుట అన్న స్థితికి మానవుడు ఎదిగి రావలసి ఉన్నది. సమర్పణ చెందిన మనస్సు ఇదిఉన్నది, అది లేదు అనుకోదు. 'ఏది ఎప్పుడు కావాలో, ఏ రూపంలో కావాలో అతడికి తెలుసును' అని గ్రహించుకొంటుంది.

దైవం మనను ప్రేమించాలి. సరే! మనం దైవాన్ని ప్రేమించవద్దా? ప్రేమిస్తున్నట్లైతే విడిచి ఉండగలమా! ఉపేక్ష చేయగలమా! ఆలోచించు. మనను మనం సర్దుకోవాలి. అలా సర్దుకొంటున్న కొద్దీ దైవానుగ్రహం దానికదిగా లభిస్తుంది. నెపమంతా ఆయనమీద వేస్తే ఎలాగ?

ప్రేమతో

..........

# ఉత్సాహం ఉద్యమంగా

విజయవాడ
4-6-92

సౌ॥...........కి ఆశీస్సులు.

నీవు వ్రాసిన లేఖ అందింది. నీ ద్వారా జరుగుతున్న దివ్యమైన కృషి ఇంకనూ విస్తరించనుంది.

ప్రవచనాల క్యాసెట్లలాగానే మన గ్రంథాలలోని భాగాలను కూడా తగిన వాతావరణంలో చదువుతూ ఉండగా రికార్డు చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది. గతంలో ఒకటి రెండుసార్లు మనవాళ్లు ఉత్సాహంకొద్దీ కొన్ని గ్రంథాల విషయంలో ఈ పని చేశారు. ఇప్పుడిక ఆ ఉత్సాహం ఒక ఉద్యమంగా రూపు ధరించవలసి ఉంది.

'నిత్య సత్యాలు-ఆణిముత్యాలు' (1,2) భాగాలు విద్యాలయాలలోని బాలలకోసం మనం రూపొందించినవి. ఈ భాగాలు పది పది చొప్పున నీకు బుక్ పోస్టులో పంపబడ్డాయి. అవి నీకు అందాయని అనుకొంటున్నాను. వాటిని విద్యాలయాలలో వారి పాఠ్యప్రణాళికలో ఒక భాగంగా ఆమోదింప చేయడంలో నీవు కృషిచేయవలసి ఉంది. అప్పుడు బాలలలోనికి ఈ సందేశం సూటిగా వ్యాపించినట్లవుతుంది. విజయవాడ, తెనాలి, నూజివీడు తిరువూరు, కోడూరు మొదలైన ప్రాంతాలలో అనేక విద్యాలయాలలో ఈ గ్రంథాలు బాలలకు బోధించబడుతున్నాయి. నీవు అడుగిడుతున్న ప్రతి చోటా విద్యాలయాలలో వీటిని ప్రవేశింప జేయడం ఒక వ్రతంగా స్వీకరించాలి.

(12)

శతక పద్యాలకు సంబంధించిన ఈ భాగాలు మరిన్ని మన నుండి రావలసి ఉంది. అలాగే బాల బాలికలకు కావలసిన విధంగా ప్రయోజన కరమూ, మహిమాన్వితమూ అయిన సాహిత్యం మన నుండి వెలువడవలసి ఉంది.

పిల్లలు ఆశ్చర్యానందాలను కోరుకుంటారు. వారికి, అలాంటి ఆశ్చర్యానందాలను కలిగించే కథలు సన్నివేశాలు మన పురాణేతిహాసాలలో లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి. తగిన పద్ధతిలో వాటిని చెప్పడం ద్వారా వారిని మురిపిస్తూనే తీర్చిదిద్దవచ్చు మనం. ఎంతటి దివ్యమైన వాఙ్మయమున్నది మనకు! దానిని ఎన్ని విధాలుగా మనం సద్వినియోగం చెయ్యవచ్చు! బాలబాలికలకు, యువకులకు, బాధ్యతలలోనున్న నడివయస్సు వారికి, బాధ్యతలు తీరాయనుకుంటున్న పెద్దలకు, ఇందరకూ కావలసినవన్నీ ఆ దివ్య సాహిత్యంలోనిక్షిప్తమై ఉన్నాయి. వాటిని వింగడించుకోవడం మనకు చేతకావలసి ఉంది.

ఒకసారి తెనాలిలోని లియోక్లబ్ వారు యువకులను పెద్ద పెట్టున సమీకరించి, 'ఈ యువతకు మీరిప్పుడు సందేశమివ్వాలి' అన్నారు. అప్పుడు నేను వారికి పరీక్షిత్తును గూర్చి చెప్పాను. విధివశాన పెద్దలందరూ ఒక్కసారిగా తప్పుకున్న వేళ ఆ చిన్న కుర్రవాడు తాను రాజై ఈ దేశాన్ని ఎలా తీర్చిదిద్దాడో చెప్పాను. స్వాతంత్ర్యానంతరం భారత దేశం యొక్క కథ కూడా ఇలాంటిదేనని చెప్పాను. పెద్దలందరూ దాదాపుగా తప్పుకొనగా యువత పరీక్షిత్తై నిలబడవలసిన తరుణం ఆసన్నమయింది! అని హెచ్చరించాను. ఈ హెచ్చరిక వారికి నచ్చింది. వారిలో అనేకులు పరీక్షిత్తుతో తమను పోల్చుకోవడానికి ప్రయత్నించసాగారు. తమను తాము అలా తీర్చిదిద్దుకోవాలి అన్న ఉత్సాహాన్ని చూపించారు. ఎంత బాగున్నది ఈ కథ! యువకులకు ఎంత చక్కటి ప్రేరణను

అందించినది అనిపించినది నాకు. ఇలాంటి సన్నివేశాలు ఎన్నెన్నో ! నీకు అనుభవానికి వస్తూనే ఉంటాయి కదా ! అయితే ఇప్పటి వారికి సేవచేయ్య డమేకాదు. ఎప్పటి వారికైనా మన సేవ అందేలాగున మనం జాగ్రత్త పడాలి. అందుకొరకే ఈ గ్రంథరచన ! వారికి అందు కొరకే !

నీలాంటి ఉత్సాహవంతులూ, ఉద్యమ శీలురూ నేల నాలుగు చెర గులా ఈ గ్రంథాలను వెదజల్లుతూ ఉద్యమానికి తగిన వాతావరణాన్ని రూపొందిస్తున్న వేళ ఈ ప్రచురణ యజ్ఞంలో ఇంకెన్ని చిత్రాలు జరుగ నున్నాయో ! వేచి చూడవలసిందే ! అన్నట్టు నీవు ఒక పని చేయాలి. మీ కుటుంబంతో శ్రుతి కలిపిన బంధుమిత్రులు వివిధ ప్రదేశాలలో దేశాలలో ఉండి ఉంటారుకదా ! వారందరికీకూడ ఈ మన గ్రంథాలను తగిన పద్ధతిలో నీవు రుచి చూపించాలి. అలా చేయడంవల్ల మరికొన్ని విశేషాలు జరుగుతాయి. ఆయా దేశాలలో దివ్యమైన ఈ బీజాలు పడతాయి. ప్రపంచం క్రమంగా మన ఉద్యమానికి స్వాగతం పలుకుతుంది.

నేను వచ్చి ఇంతవరకూ మన ఉద్యమంలో పాలుపంచుకొంటూ వస్తున్నవారిని నీకు పరిచయం చేయడమన్నది ఒక భాగం. ఇన్నినాళ్ల నీ జీవన యాత్రలో నీతో శ్రుతి కలిపి నడిచి వస్తున్న వారిలో ఈ ఉద్యమా నికి తగినవారిని ఎంచుకొని జత కూర్చుకోవడం ఒక భాగం. ఈ రెండు భాగాలూ కలిస్తే అక్కడ మానవధర్మశిక్షణ సంస్థ శాఖ వెలుస్తుంది. ఏమంటావు ! ఈ చెప్పబడిన విధంగా నీ ప్రయత్నాలను ఇకసాగనివ్వు.

భాగవతం విషయంలో నీవు మరింతగా విజృంభించి పనిచేయవలసి ఉంది. భాగవతాన్ని పుట్టుకుంటేనే ముక్తి వస్తుందట. నేటి మన జాతికి అవలక్షణాల నుండి ముక్తి లభించేటందుకుగాను మనం ఈ భాగవతాన్ని పెద్దఎత్తున వ్యాపింప చేయవలసి ఉంది. భాగవతంలో ఒక చిత్రమైన

లక్షణ మున్నది. దానిని చదువుతుంటే మనకు తెలియకుండానే మనం బాగుపడిపోతుంటాం.

జాతికి ఇవ్వాళ ఇలాంటి అవకాశం కావాలి. దానికి తెలియకుండానే అది బాగుపడిపోయే అవకాశం కావాలి. అందుకోసమే ఈ భాగవతం ఇలా దిగివస్తున్నది.

శుభాకాంక్షలు

..................

# ఒక ఆదర్శం

విజయవాడ

ఆత్మీయులు..............గారికి శుభాకాంక్షలు. 5-6-92

మీరు వ్రాసిన లేఖ అందింది. సంతోషమైంది. ఒక చిన్న కబురును అందుకున్న మీరు వెంటనే కర్తవ్యోన్ముఖులై కార్యాన్ని నిర్వహిస్తున్నందుకు ముచ్చట వేసింది. వయస్సు ఎంతగా పైబడినా మీలోని కార్యకర్త యువకుడై ఇంకా విజృంభిస్తూనే ఉన్నాడు. నిత్య నూతనమైన ఉత్సాహాన్ని ప్రకటిస్తూనే ఉన్నాడు.

తాడికొండ విద్యాలయాలనుండి అమృతోత్సవ సంచిక అందింది. దివ్యంగా ఉంది. మీ జీవన వైఖరులకు దర్పణం పడుతోంది. అమృతోత్సవ నిర్వహణలో పనిచేసిన కార్యకర్తలు ధన్యులు. దశాబ్దాల తరబడి ఒకే విధమైన దీక్షతో సత్కార్య నిర్వహణచేయటం నిజంగా ఒక విశేషమే! దైవం ఇచ్చిన శరీరాన్ని ప్రయోజనకరంగా వినియోగిస్తున్నారు మీరు. నేటి యువతకు ఈ మీ జీవితం ఒక ఆదర్శం

శుభాకాంక్షలు

..................

# జీవిత కార్యం

విజయవాడ

చి॥సౌ॥...........కి ఆశీస్సులు 13-6-92

నీవు వ్రాసిన అనుభూతి ప్రదమయిన లేఖ అందినది. నీవు కొన్ని అంశాలపై సూచనలు అడిగావు.

ధర్మపురి నిర్మాణం ఆదర్శప్రాయంగా ఉంది. ధర్మపురి ధర్మ శిక్షణ పురిగా, మానవ ధర్మ శిక్షణ సంస్థకు ఊపిరిగా రూపొందగలదని విశ్వసిస్తున్నాను.

దైవయోగంచేత నీకు మన సంస్థతో పరిచయం ఏర్పడింది. నీ సంస్కారానికి, నీలోని ధర్మావేశానికి కావలసిన ఉద్యమం ఈ సంస్థద్వారా వడుస్తున్నది. దైవం నీలో తాను కలిగిస్తున్న స్పందనను తానుగా ఈ సంస్థ వైపుకు మళ్ళేటట్లుగా చేశాడు. కనుక ఈ ఉద్యమ నిర్వహణం నీ జీవిత కార్యమై ఉన్నది. ఈ జీవిత కార్యాన్ని నిర్వహిస్తూ సమాజం లోని మిగిలిన మంచి కార్యక్రమాలకు తగిన దోహదంచేస్తూ ముందుకు సాగడమన్నది నీ కర్తవ్యమై ఉన్నది.

ఇక నీ, నా అనుబంధం- ఇది ఈనాటి కాదు. సనాతనమైనది. శాశ్వతమైనది. ఎప్పటికప్పుడు ఇలా ఉద్యమ శీలంతో వ్యక్తమవుతూ లోకహితాన్ని సాధించేటటువంటిది.

ఆశీస్సులు

...............

# ఆత్మీయులు

విజయవాడ
19-6-92

ఆత్మీయులకు అభినందనలు

మీ లేఖ చదువుతూ ఉంటే నా కన్నులు చెమ్మగిల్లాయి. మనస్సు ఆర్ద్రమైంది. హృదయం పరవశించింది. నా వారు నాకు దొరికినట్లైంది.

వీలువెంట మీరిరువురూ, కుటుంబ సభ్యులతోసహా బయలుదేరి రాగలరు.

ప్రేమతో
..................

# సజీవమైన రచన

విజయవాడ
22-6-92

ఆత్మీయులకు............శుభాకాంక్షలు

మీరు ఇచ్చిన గ్రంథాలను చదివాను. అవకాశం కలిగినప్పుడల్లా మళ్ళీ చదువుతున్నాను. గ్రంథాలు చాలా బాగున్నాయి. మీ మిగిలిన రచనలను కూడా చదవాలని అనిపిస్తూ ఉన్నది.

చక్కటి తెలుగు. హాయిగొలిపే నుడికారం. ఆహ్లాదాన్ని కలిగించే శైలి. ఆనందాన్ని కలిగించే చిత్రణ. మీ రచనలో ఎల్లెడలా గోచరిస్తున్నాయి. ఒక్కమాటలో చెప్పాలీ అంటే మీవి సజీవమైన రచనలు. సహజ సుందరమైన రచనలు.

'స్మృతి గీత' చక్కటి ప్రయోగం. భారతీయ దాంపత్యానికి ఒక మణిదర్పణం ఈ గ్రంథం.

'తెలుగు వెలుగు' తెలుగువారి సంస్కృతీ విశేషాలను గూర్చి మీ నుండి వెలువడిన అందమైన గ్రంథం. ప్రతి తెలుగువాడు తప్పక చదవాలి దీనిని.

'మొల్ల'ను గూర్చి మీరు వ్రాసిన గ్రంథం ప్రామాణికంగా ప్రేర ణాత్మకంగా ఉంది.

'సరళి' మీ సరళిని తెలియజేస్తూ ఉన్నది.

శుభాకాంక్షలు

..................

## అధ్యాపకులు - రకాలు

విజయవాడ
12-7-92

చి॥ సౌ॥......కి ఆశీస్సులు.

నీవు వ్రాసిన లేఖ అందింది. అధ్యాపక బృందం కావలసినవిధంగా స్పందించలేక పోవడానికి కారణాలు ఏమిటి అని వ్రాశావు నువ్వు. ఇందుకు కారణాలు చాలా ఉన్నాయి. మొదటిది అధ్యాపక ధర్మం తమకు స్వధర్మం కానివాళ్లు అధ్యాపకులుగా వస్తున్నారు. తమకు స్వధర్మం కాని పని వీరికి పరధర్మం అవుతుంది. దానిని వీరు భయావహంగా పరిణమింప జేస్తారు. ఇలాంటివారికి ఎన్ని విలువలు బోధించినా చెవిటికి శంఖు ఊదినట్లే!

ఇక రెండవరకం వారు-కేవలం కాలక్షేపం కోసం అధ్యాపకులుగా పనిచేస్తున్నవాళ్లు. వీళ్ళకు కావలసింది కాలక్షేపం. విలువలతో వీరికి పని లేదు. విలువలను గూర్చి వీరికి చెబితే పరిహాసపూరకమైన దరహాసాన్ని పెదవులపై చిందించగల నేపథ్యం వీరిది.

మూడవరకంవారు-భయస్థులు. విలువలపై వీరికి అభిలాష ఉన్నప్ప టికీ మన ఒక్కరి వల్లనే ఏమవుతుంది? అని అనుకుంటూ కాలాన్ని వెళ్ళబుచ్చే మన స్తత్వం వీరిది. వీరికి విలువలను గూర్చి చెబితే ఎంత ఇష్ట పడతారో అంత భయపడతారు. స్వాతంత్ర్యానంతరం పుట్టుకు వచ్చిన తరాలలో సాహసికుల కంటే భయస్థులే ఎక్కువమంది కనబడుతున్నారు.

ఇక నాల్గవరకంవారు. కావలసిన చేయూత లభిస్తే కదలి ముందుకు సాగుదామని అనుకుంటున్నవారు. వీరినే ముందు మనం కదపగలగాలి. అప్పుడు వీరు ముందుకు సాగుతారు. మిగిలినవారు క్రమంగా వీరి ప్రభావా నికి లోనై వీరి అడుగుజాడలలో ముందుకు సాగే స్థితికి వస్తారు.

అధ్యాపక బృందాలతో గోష్ఠి జరుపుతున్న వేళలో ఇన్ని రకాల వారూ ఆ బృందంలో ఉంటారు. నిరుత్సాహ పడవలసిన పనిలేదు. నాల్గవ రకం వారిని పొదివి పట్టుకొని మొత్తం కథను ముందుకు నడిపించవచ్చు.

ఒక గ్రామంలో మార్పును తీసుకురాగోరేవారు ఏం చేస్తున్నారు? ఆ గ్రామం మొత్తంమీద మార్పుకు అంగీకరించి కలసివచ్చేదెవరన్నది గమనించుకొని వారిని ముందు చేరదీస్తున్నారు. ప్రణాళికను వారికి వివరిస్తు న్నారు. వారు చైతన్యవంతులై ముందుకు సాగుతున్నారు. మిగిలిన గ్రామం మెల్లమెల్లగా వారివెంట కదులుతూ ఉన్నది.

అధ్యాపక బృందం విషయంలో కూడా సరిగా మనం ఇలాగే ప్రవర్తించవలసి ఉన్నది.

అధ్యాపక వర్గంతోపాటు విద్యాలయ నిర్వాహకులు కూడా మన మందిస్తున్న మంచిని స్వీకరించగలిగిన వారై ఉండటం ఎంతైనా అవ సరం. విద్యాలయాలను నిర్వహించే వారిలో సగానికి సగంమంది వ్యాపార సరళిలో నడుపుతున్నవారే కనబడుతున్నారు. వీరిలో కూడ సంస్కార

వంతులు, సంస్కృతిప్రియులూ లేకపోలేదు. ముందుగా వారిని మనం కను గొని మనతో కలుపుకోగలగాలి. అప్పుడు మనం చేపట్టిన కార్యం సఫల మవుతుంది.

ఎప్పుడైతే దృఢ సంకల్పంతో ముందుకు సాగుతున్నామో, అప్పుడు మనకు తగినవారు, మనతో శ్రుతి కలుపగలిగినవారు ఇటు అధ్యా పక వర్గంనుండి అటు విద్యాలయ నిర్వాహక వర్గంనుండి కూడ మనకు చేరు వవుతారు. పంచదార ఎక్కడెక్కడి చీమలను ఆకర్షిస్తున్నట్లుగా మంచి దారిని సూచిస్తున్న మన సంకల్పమే తగినవారిని తప్పక ఆకర్షించుకొన గలదు. ఏ సంకల్పం మిమ్ములను నాకు దగ్గర చేస్తున్నదో, ఆ సంకల్పమే వారిని మీకు దగ్గర చేయగలదు.

ప్రయాణ వేగాన్ని పెంచండి. ఫలితాన్ని నాకు వదిలివేయండి.

ఆశీస్సులు

................

## హర్షమే వర్షమై

విజయవాడ

ఆత్మీయులు......గారికి శుభాకాంక్షలు. 4-8-92

'శ్రీమద్భాగవతము-దివ్యజీవన మార్గము' గ్రంథ ఆవిష్కరణ సభ నిండుగా జరిగింది. చక్కటి వర్షంకూడా ఆ రోజున పడింది-ఇది భాగవత మహిమా అన్నట్లుగా! భూమి చల్లబడింది. వ్యవసాయదారుడు భూమిని తడిపి, ఆర్ద్రమైన స్థితికి తెచ్చి, అప్పుడు విత్తనాలను చల్లినట్లుగా భూమిని

కరువు కాటకాలనుండి బయట పడేట్లుగా చేసి, ఆర్ద్రమైన స్థితిలో భూమా తను పులకింపజేసింది భాగవతం. మరొకసారి భూభార నిర్వాపణం జరుగు తున్నది. ధర్మసంస్థాపనం ప్రారంభమైంది అన్న ధైర్యాన్నీ, తృప్తినీ భూమాతకు నిండుగా అందించింది భాగవతం. తాను ఆవిష్కరింపబడు తూనే ఆమె ఆర్తిని తీర్చింది.

అలాగే మీరు సంకల్పించిన గ్రంథాలయ నూతన భవన ప్రారం భోత్సవం కూడా దివ్యంగా జరగాలని శుభాశంసనం చేస్తున్నాను.

ప్రేమతో

..................

## నిండుగా తలుచుకొందాం

విజయవాడ

ఆత్మీయులకు............శుభాకాంక్షలు. 4-8-92

మీ ఆహ్వాన మందింది. సంతోషమైంది. విజయవాడ నగరానికి మూల స్తంభాలలో ఒకరయిన డాక్టర్ టి. వి. చలపతిరావు గారి స్మరణను ప్రతి సంవత్సరం శ్రద్ధతో నిర్వహిస్తున్నటువంటి మీరు ధన్యులు. పెద్ద లను తలుచుకోవడమే పిన్నలు తరించేటందుకు మార్గమవుతుంది. పెద్ద లను తలుచుకున్నప్పుడే ధర్మం తన ద్వారాలను తెరచి మనలను లోనికి ఆహ్వానిస్తుంది. పెద్దలను తలచుకున్నప్పుడే దైవం మనలను వెన్నుతట్టి ఆశీర్వదిస్తాడు. ఆ పెద్దలుగా దిగి వచ్చినది 'నేనే' సుమా అన్న దివ్య దర్శనాన్ని మనకు అనుగ్రహిస్తాడు. మన జీవితాలను జాతిహిత సాధనా లుగా రూపొందిస్తాడు.

సోదరులారా! కనుక మనం పెద్దలను నిండుగా తలుచుకొందాం! నిజంగా తలుచుకొందాం. అలా తలుచుకుంటున్న క్షణాలలో వారే మన మవుతున్నామన్న నిజాన్ని తెలుసుకుందాం.

ప్రేమతో

.................

# శ్రీ రా మ ర క్ష

విజయవాడ

ఆత్మీయులు........గారికి శుభాకాంక్షలు. 6-8-92

సమర్పణ భావంతో శరణాగతి మార్గాన మీరు వ్రాసిన హృదయ పూర్వకమైన లేఖ అందింది. తీవ్రమైన అనారోగ్యం నుండి దైవాను గ్రహ విశేషాన మీరు బయటపడి క్రమంగా కోలుకుంటున్నందుకు చాలా సంతోషంగా వుంది. మాస్టరుగారి ఆశీస్సులు ఎల్లవేళలా మిమ్ములను వెన్నంటి ఉంటాయి. రక్షాకవచమై మిమ్ము రక్షించుకుంటాయి. నా వెంట నుండువారికి ఎన్నడూ భద్రమే! అన్నది మాస్టరుగారు మానవ జాతికి ఇచ్చిన మాట. ఈ మాట మీ ఎడల నిజమై, మీరు వర్ధిల్లుతున్నందుకు సంతోషంగా ఉంది. మీ మంచితనమే మిమ్ములను రక్షించింది. మాస్టరు గారికి మిమ్ములను దగ్గరకు చేసింది కూడ మీ మంచితనమే! అదే మీకు శ్రీరామరక్ష!

అందరికీ అడిగినట్లు చెప్పండి.

ప్రేమతో

.................

# మైత్రి చిరంజీవి

విజయవాడ

ప్రియమిత్రులు........గారికి ప్రేమతో వ్రాయునది. 21-8-92

ఆత్మీయతతో మీరు వ్రాసిన లేఖ అందింది. సంతోషమైంది. మైత్రి చిరంజీవమైనది. అది తప్పు పట్టదు. అదితుప్పు పట్టదు. ఆ తలపు మూసేది కాదు. ఆ తలుపు మూసేది కాదు. మనిషిని బ్రతికించేది, మనిషికి బ్రతుకు నిచ్చేది మైత్రి ఒక్కటే! బంధుత్వాలు కూడా మైత్రిగా పర్యవసించినప్పుడే రాణించగలుగుతాయి. అనుభూతిని అందించగలుగుతాయి.

యోగస్థితి అన్నది మైత్రితోనే సాధ్యపడుతుంది! అంటాడు గీతాచార్యుడు. ఈ సృష్టితోనూ, సృష్టికర్తతోనూ మైత్రిని నెరపడమే నిజమైన సాధన-అంటాడు అతడు.

వీలుచేసికొని తప్పకుండా రండి. అందరం కలసి మాస్టరు గారి కార్యక్రమాన్ని నిర్వహించుకొందాం. అందరినీ అడిగినట్లుగా చెప్పండి.

ప్రేమతో

.................

# గ్రామ గ్రామానికి

విజయవాడ

భాగవత మూర్తులు......గారికి శుభాకాంక్షలు. 3-9-92

ఆత్మీయమైన మీ లేఖ అందింది. మీరు కోరినట్లుగా సాధ్యమైనంత త్వరలో గీతాచార్యుని సందేశాన్ని మీకు అందజేస్తాను.

గ్రామ వాతావరణంలో మీరు నిర్వహిస్తున్న ధర్మకార్యక్రమాలు నాలా ఆనందాన్నీ, తృప్తినీ కలిగిస్తున్నాయి. 'గ్రామ గ్రామానికీ మీలాంటి వారు ఒక్కరొక్కరు ఉంటే చాలును' అని అనిపిస్తున్నది. గీతాచార్యుడు మీనుండి తన కార్యక్రమాన్ని మరింతగా నిర్వహించు గాక!

శుభాకాంక్షలు

................

## హోమ ద్రవ్యం

విజయవాడ

19-9-92

ఆత్మీయులకు ......... శుభాకాంక్షలు

మీరు పంపించిన ద్రవ్యం అందింది. ప్రచురణ యజ్ఞానికి అది సమర్పింపబడింది. ఇక్కడ ద్రవ్యం కూడా హోమ ద్రవ్యమే అవుతుంది. హవిస్సుగా రూపొంది, జ్వాలగా వెలుగుతూ లోకాలలో వెలుగును నింపుతుంది. నిండైన లోకశ్రేయస్సును నిరంతరం సాధిస్తుంది. అలాంటి ఈ యజ్ఞంలో పాల్గొంటున్న మనమందరము ధన్యులం. భాగవతాన్ని ఆసాంతమూ చదివి మీ అనుభూతిని వ్రాసి పంపగలరు.

శుభాకాంక్షలు

................

# ఏడు చాళ్లు

విజయవాడ

చి॥ సౌ॥........కి ఆశీస్సులు. 27-9-92

లేఖ చేరింది. నడుస్తున్న ఉద్యమానికి విజయం లభిస్తుంది.

వీలు చూచుకొని పూర్తిగా రెండు రోజులపాటు ఇక్కడ ఉండేటట్లుగా వచ్చినట్లయితే అక్కడ సాగుతున్న మన కార్యక్రమానికి ఒక సమగ్ర మైన రూపం వచ్చేటందుకు గాను కావలసిన ప్రణాళికను అందుకొని వెళ్ళవచ్చు. కార్యక్రమానికి ఒక విశేషమయిన రూపం వచ్చిన తరువాత అప్పుడు నేను అక్కడకు రావడం సముచితంగా ఉంటుంది. ఏడు చాళ్ల దున్నిన తరువాత రైతు వేరుశనగ విత్తనాలు చల్లుతాడు తన పొలంలో. గురువుకూడా రైతువంటి వాడే! అది తన పొలమే అయినా కాలం కలిసి రావాలి. కృషి కావలసినంతగా జరగాలి. అప్పుడే అతను విత్తనాలు చల్లు తాడు. అంతవరకూ వేచి ఉంటాడు.

ఆశీస్సులు

................

# శుభాకాంక్షలు

విజయవాడ

ఆత్మీయులకు...........శుభాకాంక్షలు. 1-10-92

రజతోత్సవ సంచికకు సందేశాన్ని వ్రాసి పంపమని కోరారు మీరు. సందేశం వెలువడింది. ఇదిగో వ్రాయించి పంపుతున్నాను అందుకోడిం,

సంచిత గీతాచార్యుని దివ్యస్పర్శను నిండుగా అందించగలదు. జిజ్ఞాసువులకు దారి చూపగలదు. బాటసారులను సేద తీర్చగలదు. ఈ మార్గాన మన జీవితయానమే మనస్సుకు ధ్యానమై, ఆతడి గానమై ఈ భువినే ఒక బృందావనముగా రూపొందించగలదు.

శుభాకాంక్షలు

................

## మంచి రోజులు రావాలి

విజయవాడ

చి॥సౌ॥......కి ఆశీస్సులు. 16-10-92

నీ లేఖ అందింది. సంతోషమైంది.

మద్యనిషేధ ఉద్యమం మీ మీదుగా కావలసిన వేగాన్ని సంతరించు కొంటున్నది. ఇది ఒక శుభ పరిణామం. మిగిలిన దేశానికి కూడ ప్రేరణను ఈయగలిగిన పరిణామమిది.

కొద్ది సంవత్సరాల క్రితం కృష్ణదేవి పేటలో ప్రవచన సందర్భంగా ఒకమాట చెప్పాను! 'ప్రజలే మద్యాన్ని బహిష్కరించాలి. మా గ్రామంలో సారా దుకాణం అవసరం లేదు' అని ఏ గ్రామానికా గ్రామం ఎలుగెత్తి చెప్పాలి. ప్రభుత్వానికే కనువిప్పు కలుగజేయాలి. ప్రజలు చైతన్యవంతులైతే ప్రభుత్వం కూడా దారిని పడుతుంది. దారిని తప్ప డానికి జంకుతుంది. అలాంటి మంచిరోజులు రావాలి. ప్రజలు ప్రభుత్వాన్ని

రూపొందించడమే కాదు. ప్రభుత్వానికి కావలసిన పథ నిర్దేశాన్ని కూడా ప్రజలే చేయగలగాలి. ఆ మంచిరోజులు రావాలి అని.

ప్రేమతో

……………

## కథ అతనిది

విజయవాడ

ఆత్మీయులకు……… 19-10-92

లేఖ అందింది. బాధ కలిగింది. శ్రీ……గారు దారుణమైన వ్యాధికి గురై ఇలా అకాల మరణానికి గురికావడం తట్టుకొనడానికి కష్టమైన విషయమే! ఆయన సహృదయులు! అవకాశమున్నంతలో అందరికీ అన్ని విధాలా సహకరిస్తూ వచ్చిన సజ్జనులు. భూమిమీద ఉన్నంతకాలం మంచి మనస్సుతో మంచిగా, మనిషిగా నిండుగా బ్రతికినవాడు. అలాంటి వాడు శరీరాన్ని విడిచిపెట్టడం తీరని లోటుగా అనిపిస్తుంది నాకు.

చివరి దశలో మీరు ఆయనకు అందించిన సహకారం, చేసిన సేవ అమూల్యమైనవి. ఆదర్శప్రాయమైనవి. ఒకరకంగా మీరు అందించిన సేవయే ఈ చివరిదశలో ఆయనను ఇన్నాళ్లు అట్టిపెట్టగలిగిందేమో! మీకు నా కృతజ్ఞతలు.

అర్ధాంతరంగా ముగిసినట్లుగా కనబడుతున్న ఈ కథను ఇకమీదట అర్థవంతంగా నడపవలసినవాడు దైవం. కథ అతనిది. మనం పాత్ర ధారులం.

## సృష్టి ధర్మం

విజయవాడ
18-11-92

యోగ మిత్రులకు శుభాకాంక్షలు

కార్యక్రమ వివరాలు తెలిసికొని ఆనందించాము. మాస్టరుగారి కార్యక్రమం వివిధ ప్రాంతాలలో నిండుగా నిర్వహింపబడుతున్నందుకు సంతోషంగా ఉంది. ఇన్ని బృందాల మధ్యా వైవిధ్యమే ఉన్నది తప్ప వైరుధ్యములేదు. వైవిధ్యం ఈ సృష్టిధర్మం దానిని మనం ఆమోదించడం అవసరం.

ప్రేమతో

................

## దైవకార్యం

విజయవాడ
18-11-92

చిరంజీవికి ఆశీస్సులు

కాలం గడుస్తూ ఉన్నది. సరైన నిర్ణయాన్ని తీసికొని నిర్మాణాత్మకంగా మనం ముందుకు సాగవలసి ఉన్నది.

కాలం కలసి వస్తున్న వేళ ఇది. మనం తగినంత శ్రద్ధతో ఈ అవకాశాన్ని అందుకోవాలి.

దినచర్యనుండి బయటపడి దైవకార్యాన్ని సాధించవలసిన సమయం ఆసన్నమవుతూ ఉన్నది.

ఆశీస్సులు

................

# ఏమి చెప్పగలను!

విజయవాడ

పూజ్యులు........గారికి నమస్కరించి వ్రాయునది 27-11-92

ఆత్మీయమైన మీ శుభాకాంక్షలు అందాయి. చిరకాల మిత్రుడు, పరిపూర్ణ పురుషుడు, నిరంతర శ్రేయోభిలాషి, అత్యంత ఆత్మీయుడు అయిన 'ఒకడు' వెన్నుతట్టి మెచ్చుటిస్తున్నట్లు అనిపించింది. భుజంపైన చేయివేసి ప్రోత్సాహమిస్తున్నట్లు కనిపించింది. చేతితోడ చేతిని కలిపి ప్రయాణపు వేగాన్ని మరింతగా పెంచినట్లు అనుభవానికి వచ్చింది. అట్టి మీకు కృతజ్ఞతలు ఎలా చెప్పాలి! కలకాలం మీ మాటలను తలుచుకుంటూ తన్మయత్వాన్ని అనుభవించగలను, తప్ప వేరుగా ఇంకేమి చెప్పగలను ?

నమస్సులతో

..................

# ప్రేమ సాక్షాత్కారం

విజయవాడ

ప్రియమిత్రులకు శుభాకాంక్షలు. 30-11-92

మీరు వ్రాసిన అనుభూతి ప్రదమైన లేఖ అందింది. మీ జీవితాన చక్కటి మార్పు వస్తున్నది. మనస్సు నొచ్చుకుంటున్న స్థితినుండి మనస్సు విచ్చుకుంటున్న స్థితికి మీరు ప్రయాణిస్తున్నారు. అలాంటి మీ ప్రయాణానికి నానుండి దిగివస్తున్న రచనలు మీకు తగిన దోహదాన్ని అందిస్తున్నాయి. ఇది ఒక శుభపరిణామం. జరుగుతున్న కృషి ఇలాంటి దివ్యమయిన ప్రయోజనాన్ని సాధిస్తూ ఉన్నందుకు నాకు చాలా సంతోషంగానూ, తృప్తిగానూ ఉంది.

ఈ గ్రంథాలు మన మధ్యగల స్నేహాన్ని మరింతగా పెంచగలవు. ప్రేమ మార్గాన మనలను కలిపి నడిపించగలదు. ప్రేమదేనినీ కాదనదు. దేనినీ వద్దనదు. అన్నిటినీ కలుపుకొంటుంది. అన్నింటినీ తనలో నిలుపు కొంటుంది. తానుగా నిలుపుకుంటుంది. అప్పుడు అంతటా ప్రేమయే సాక్షాత్కరిస్తుంది. అన్నిటా ప్రేమయే అనుభవానికి వస్తుంది. అలాంటి ఆ ప్రేమను నిండుగా అనుభవించడానికే దుర్లభమయిన ఈ మానవజన్మము మనకు అనుగ్రహించబడింది.

శుభాకాంక్షలు

................

## సమష్టి కృషి

విజయవాడ

ఆత్మీయులు............గారికి శుభాకాంక్షలు 17-12-92

మీరు పంపిన దివ్య గ్రంథం అందింది. నారాయణస్వామి వారి జీవిత చరిత్ర భాగవత మార్గాన దివ్యంగా సాగింది. రచయిత యొక్క చిత్తశుద్ధి, వినయ విధేయతలు, సమర్పణ బుద్ధి- ఈ రచన ఇలా రావటానికి చక్కగా ఉపకరించాయి.

మీలో కలిగిన సంకల్పం, రచయిత ద్వారా ఈ జీవనగాథగా ఇలా సువ్యక్తం మయ్యింది.

ఈ గ్రంథ రచనా, ప్రచురణా ఒక సమష్టి కృషిగా సాగింది. పెద్దలు మననుండి కోరేది ఇలాంటి సమష్టి కృషినే! సమష్టికృషి ఎక్కడ ఉంటే పెద్దలయినవారు అక్కడే ఉంటారు.

శుభాకాంక్షలు

................

# కృతజ్ఞతలు రు. 20-00

విజయవాడ

ఆత్మీయులకు శుభాకాంక్షలు. 17-12-92

మీకు బాధ్యతలు అప్పగించబడలేదు. అవకాశములు అమర్చిపెట్టబడినవి. పెద్దలు బాధ్యతలను అప్పగించరు. అవకాశములను అందిస్తారు.

ఆ అవకాశములను కొందరు పనులుగా పొరబడుతున్నారు. తప్పించుకొంటున్నారు. కొందరు బాధ్యతలుగా భ్రమపడుతున్నారు. ఈ బరువెందుకనుకుంటున్నారు. అవకాశములుగా గ్రహించిన కొద్దిమంది మాత్రము అలా అలా ముందుకు సాగిపోతున్నారు. ఇది మన అదృష్ట మనుకొంటున్నారు.

తెల్లవారి లేచింది మొదలు ఇన్నిపనులు చేస్తున్న మీకు, ఈ చిన్ని పనులు బాధ్యతలుగా, బరువులుగా- చేయలేనివిగా, మోయలేనివిగా, గోచరిస్తున్నాయి కదా ! ఎందుకని ? మీ పరిధినుండి మీరు ఈవలకు రాలేక పోతున్నారుకదా, అందుకని !

ఇప్పుడు మీపైన నాకు కోపం రావటంలేదు. జాలివేస్తున్నది. తమ తమ పరిధులను దాటి, పరిమితులను తొలగద్రోసి, వివిధ స్థాయిలలో ఈ మన ఉద్యమంలో పాలుపంచుకొంటున్న వారిని చూస్తున్నప్పుడు, ఇదివరకటికన్నా నాలో వారియెడల కృతజ్ఞత వేయింతలుగా పెరుగుతున్నది. ఈ పెరుగుదలకు దోహదంచేస్తున్న మీ పరిమితత్వానికి నా కృతజ్ఞతలు.

ప్రేమ చిత్రమైనది. అది వేచి ఉంటుంది, తప్ప విసిగిపోదు. దోహదం చేస్తుంది తప్ప దూరంకాదు. ప్రయత్నం చేస్తుంది తప్ప ఫలితాన్ని కోరదు. కడవరకు సాగుతుంది తప్ప కినిసి కదిలిపోదు. పరిమితమైన పరిధిని పట్టుకొని వ్రేలాడుతున్న మీరు పరమాత్మను అందుకొని పరవశించే వరకు మీకు తన చేయూతను ఇస్తూనే ఉంటుంది అది. కనుకనే దానిని ప్రేమ అన్నారు.

ప్రేమతో

...............